# SRI VENKATESWARA UNIVERSITY



THREE YEAR DEGREE COURSE

TELUGU SELECTIONS

IN

# POETRY

FOR DETAILED STUDY

UNDER PART II

FOR THE

**Examination of 1977**



PUBLISHED BY

SRI VENKATESWARA UNIVERSITY

TIRUPATI




***Price : Rs. 3-50***

*(Do not pay more than this price)*

**SRI VENKATESWARA UNIVERSITY**



# THREE YEAR DEGREE COURSE

## TELUGU SELECTIONS

IN

# POETRY

## FOR DETAILED STUDY

UNDER PART II

FOR THE

**Examination of 1977**



*PUBLISHED BY*

**SRI VENKATESWARA UNIVERSITY**

**TIRUPATI**

# విషయసూచిక

# ౧. సంజయ రాయబారము

## తిక్కన

### భారతము – ఉద్యోగపర్వము – ప్రథమాశ్వాసము

ధృతరాష్ట్రుండును బుత్ర మిత్ర వృద్ధామాత్య సహితంబుగా నాస్థానాసీనుండయి యుండి సంజయురావించి యతని కిట్లనియె. 1

పాండునరపాల సుతు లుప - ప్లావ్యమునకు
వచ్చి యున్నారు నీ వేఁగి - వాసుదేవ
సహితముగ వారిఁగని తద్వి - షాద మేమి
భంగి [1]మాను నమ్మెయిఁ దగఁ - బలుక వలయు 2

మీ యయ్య మీరు వనవా
సా యాసము నిస్తరించి - యభ్యుదయమునన్
డా యుట విని ముదితాత్ముం
డైయిట పుత్తెంచె నన్ను - నను మీ మొదలన్ 3

అనిచెప్పి చుట్లనున్న వారలతో నిట్లనియె. 4

దుర్యోధనుండు గార్యా
కార్యజ్ఞుఁడు గామి నిట్టి - కలఁక గలిగెఁగా
కార్యులు దృఢధైర్యులు రణ
ధుర్యులు నగు పాండుసుతులు - దోషా[2]న్వితులే 5

క్షీరోదక వృత్తి మనము
వారలనుం గలసి బ్రదుక - వలదే నెమ్మిన్

1. బాయు 2. తక్కులే

వా రిపుమలఁ బసఁ దగియెదు
వారే పితృభాగమేలు - [1]వారలు గారే 6

మనల నింక నమ్మ - రనృతాత్మ లన్యాయ
పరులు గప్వ లనుచుఁ - బాండు సుతులు
గూడి మనుట కియ్య - కొన నేర రైనను
ధర్మజుండు గలఁడు - దగవు నడప 7

అని పలికి వెండియు 8

మనకీ కుంపఁగ వచ్చునే మనము దు - ర్మానంబు [2]వాటించి యొ
ప్పని కార్యంబులు వట్టి వారికిఁదగం - బాలీక [3]గర్వంబు లా
డిన నిక్కంబగు నల్క నర్జునుఁడు గాం - డీవంబు మోపెట్టఁ గృ
ష్ణుని సారథ్యము నై జగత్త్రితయ సం - క్షోభంబు గాకుండునే 9

అలఘు గదఁ [4]బూంచి కొని భీముఁ - డతి రయమునఁ
గురు కుమారులపైఁ దీవ్ర - కోప [5]మెసఁగఁ
గవియు టాత్మ భావించినఁ - గంప మడరు
నిక్క మెవ్వరు మార్కొని - నిలుచువారు 10

కవ [6]లగ్రజన్ముల - కంటె నేమిటఁ గీడు
ద్రుపదుఁ డల్పుండె త - త్సుతులు బాహు
గర్వ సమగ్రులు - గారె విరాటుండు
నాతని తమ్ములు - నాత్మజులును
ననదులే సాత్యకి - యలఁతులఁ బోయెడు
వాఁడె వృష్ణికుమార - వరు లనేకు
లట్టి యోధులు ఘోర - నరవాయి గొందురే
పాండ్యుండుఁ గేకయ - పతులు నాది

1. వారల కా 2. నంజేసి 3. దర్పంబు 4. బుచ్చికొని 5. మడర
6. లగ్రజుల కంటెకడు పెట్టిదులు కారె

యైన బంధులు మిత్రులు - నగ్గలి కలఁ
గొఱఁత వడియెడు వారె యం - దఱును గెల్వ
నోపినను రుద్రునకు నైన - నోర్వరాని
ధర్మపుత్రు కోపమునకుఁ - దలఁక వలదె ? 11

అని పలికి సంజయు డిక్కు మొగంబై యెల్లవారును విన నిట్లని
యె 12

నీవు ధర్మజు పాలికి - నెమ్మి [1]నరుగు
మతఁడు పేరోలగంబున్న - యవసరమునఁ
గాన్పు మతనికి ననుజ వ - ర్గంబునకును
బంధులకు నింపు పుట్టంగఁ - బలుకు మచట. 13

నెయ్యము [2]వాటించి కడుం
దియ్య మెసఁగ నలుక లెల్లఁ - దీఱునటులుగాఁ
గయ్య మను తలఁపు లోనుగ
నయ్యమ నందనుఁడు మాను - నట్టి తెఱఁగునన్ 14

శాంతి ప్రకారంబునం గార్యంబు నడిపి యొక్కటియై మనుట యొడఁ గూర్చి రమ్మని రథం బెక్కి పొమ్మని తగిన తెఱంగున వీడ్కొలిపిన సంజయుండునుం జని యుప ప్లావ్యంబు సొచ్చి మాధవు మందిరంబున కరిగి యభ్యంతర వినోదంబుల నర సహితుండై యున్న యన్నారాయణునకుం దన రాక యెఱింగించి పుచ్చి తగఁ బ్రవేశించి భయ భక్తి వినయ సంభ్రమంబులు మెఱయ వారలం గాంచి యమ్మహాత్ము లిరువుర సంభావనంబులును సంభాషణంబులునుం బడసి సంప్రీత చేతస్కుండై మఱునాఁడు ధర్మతనయు నొడ్డోలగంబున్న సమయంబు వేచి సముచితం

1. నరిగి, యతని 2. వాటించిన మది

బుగా నతనింగని సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన నతండుఁ బ్రియపూర్వ కంబుగా నాదరించి తన సమీపంబున నునిచి కొనినం గొలిచి యుండి యతని కిట్లనియె. 15

[1]భాగ్యమున నిన్నుఁ గనుఁ గొనఁ - బడసి నాదు
చూడ్కి చరితార్థ మయ్యెన - శ్లోక పుణ్య
ఘనుఁడు మీ తండ్రి ధృతరాష్ట్ర - ధరణి నాథుఁ
డిందు మీ యున్కి విని ప్రియ - మెనక మెనఁగ 16

అనుజులు నీవును ద్రోవది
యును బుత్ర చయంబు నున్న - యోగ క్షేమం
బున తెలఁగొరయఁ బుత్తెం
చె నితాంత స్నేహపూర్ణ - చేతో వృత్తిన్. 17

అనిన సూతనందనునకు ధర్మనందనుం డిట్లనియె. 18

ఆరాజు మాదెసం గల
కారుణ్యము కతమునను సు - ఖంబున నిట్లు
న్నారము నిమఁ బుత్తెంచిన
గారవమున నాదు మది వి - కాసముఁ బొందెన్. 19

అమ్మనుజేశ్వరునకు సే
మమ్మే? పుత్రకులు సుఖులె? - మనుమలు సమ్మో
దమ్మునఁ బెరిఁగెదరే? నగ
[2]రమ్ముల భూములను శుభ ప - రంపర గలదే. 20

ద్రోణుండుఁ గృపుఁడును - ద్రోణసుతుండును,
సుఖ మున్నవారె? సు - శ్లోకుఁడైన

1. భాగ్యమునఁగాదె నిన్నుఁజూడ బడసి నాదు 2. రమ్మున జనులకును

భీష్ముండు గురులియే - పెద్దతనం బిచ్చి;
యాతనిఁ గౌరవు - [1]లనుసరించి
మెలఁగుదురే బ్రాహ్మ - ణులకు మన్నన గల్గి,
యుండునే యే మర్థి - నొసఁగి నట్టి
వృత్తులు సెల్లునే - యొత్తొరు వొండుల
వలనఁ బుట్టదు గదా - కలఁకు లందుఁ
బుట్టి నప్పుడు గాండీవి - భుజ బలంబు
తలఁతురా భీమసేను గ - దా విహార
ముగ్గ డింతురె కవలు మ - హోగ్ర రిపుల
భూము లంతంత కొత్తుట - పొగడఁ బడునె 21

ఒకనాఁడా తమ ముందటం బలుమఱున్ - హోరాటమై నేలయొ
త్తికొనంగా బవరంబులన్ గెలువఁగా - దెల్లంబు గాఁ జూచి పాం
డుకుమారాళి నుతింప కుండుదురె యా - టోపంబునన్ ఘోషయా
త్రకు గంధర్వులు వచ్చినప్పటి చరి - త్రం బాత్మలం బాయునే 22

వినుము మనము మధ్యస్థుల
మని నర్జును నెదిరి సంజ - యా! యిట మున్నె
వ్వనికిని మానముఁ బ్రాణం
బును దగఁ దక్కించు కొనఁగఁ - బోలునె చెపుమా! 23

దుర్యోధను నింటం దగు
కార్యమునకు ఖడ్గమునకుఁ - గలవాఁడై చా
తుర్యంబు మెఱయు కర్ణుని
యార్యత్వము సెల్లుచున్న - యదియే నెమ్మిన్ 24

అనిన విని సంజయుండు సవినయంబుగా నిట్లనుఁ గురురాజు
నొద్ద నవినీతులు నీతిమంతులు సత్త్వసంపన్నులు దురహంకారులు

1. లాదరించి

మఱియు వివిధ ప్రకా[1]రులు నయి బెరసి యుండుదురు, వా రొకళ్లొకళ్ల
మాటలం బోయెడు వారు గారు కావున వారి నంత యనం బని లేదు నా
విన్నపంబు చిత్తగింపుము. 25

పొందొందఁగఁ దలఁచితి నీ
విందు శిశిరమైన విమల - హృదయంబున వా
రందఱకును సేమం బిట
ముందర లేకున్న నేఁడు - మొదలుగఁ గల్గుగున్. 26

ధృత రాష్ట్ర భూపతికి వృ
ద్ధత కతమునఁ జిత్త మొకవి - ధము గామి సుతో
ద్ధతి మాన్పఁడ నా[2]ఁడు మనః
క్షతి పిదపం బుట్టి యిపుడు - శాంతుం డయ్యెన్. 27

ఇట్టి చందంబు లెల్లను - నీవు పుణ్య
చిత్త వృత్తి[3]మై సైఁచినఁ - జెల్లి వచ్చు
నీయజాత శత్రుత్వంబు - నిఖిల లోక
విశ్రుతము గాదె ధర్మప్ర - వీణ హృదయ. 28

జగముల నెల్లెడన్ దురిత - సంతమసంబు జయింపఁ గోరి పొ
ల్పుగఁ బరమేష్ఠి నిల్పినవె - లుంగు మహీసురు లట్టివారికిం
దగవు ఘటింప సత్పురుష - దత్తములై చను జీవనంబు లెం
తగుమతులైన మార్తురె ప-దంపడి యాయువు శ్రీయు నొల్లరే 29

ఒక్కొకచోఁ గడంగి ప్రతి - యోధులు మాఱ్కొనునప్పు డాత్మలన్
నెక్కొని మోములం [4]బొడవు - నెవ్వగ తోఁచ జనంబు లిట్టి యం
దక్కట భీముఁడైన మన - యర్జునుఁడైనను మాద్రిపుత్రులం
దొక్కరుఁడైన నీపగఱ - నుక్కడఁగింపరె యొక్క వ్రేల్మిడిన్ 30

1. రంబులఁ బెరసి 2. డమన, స్మృత 3. సహించిన, సైరించిన 4. బొదువు

వారొక యాగ్రహ వృత్తిం
[1]గూరి యధర్మంబు సేఁత - కుం జాలరు దు
ర్వారబలు లయ్యుఁ బాండు కు
మారులు శాంతాత్ములంద్రు - మనుజాధీశా! 31

నలువురు దమ్ములు భవదా
ప్తులుఁ గృష్ణుఁడు వినుచు నుండ - ధూవర! నీకేఁ
గొలువునను విన్నవింపం
బలుకులు గల వవధరింపు - పరిపాటి మెయిన్ 32

అనవుడు వీరె తమ్ములును - నాప్తులుఁ గృష్ణుఁడు [2]వీరె తక్కుకొ
ల్వునఁ గల యట్టి సర్వజను - లున్ వినుచుండెద రయ్య నిన్ను నే
మనుమని పంచెఁ జెప్పు మది - యంతయు నేర్పడ నన్న ధర్మనం
దను గరువంపుఁ బల్కులవి - ధంబునకున్ మదిలోన నుల్కుచున్

సంజయుండు గృష్ణు - సద్భక్తి నీక్షించి
పవన పుత్రుఁ బార్థుఁ - గవల ద్రుపద
తనయు సవినయమునఁ - గనుఁ గొని ప్రీతిఁ బాం
చాలు మత్స్య ధరణి - పాలుఁ జూచి. 34

సావధానులరై వినుండని పలికి యుధిష్ఠురు దెసకు మోడ్పుఁగేలు
[3]విగిడించి యిట్లనియె. 35

శాంతతఁబొంది కార్యము దె - సన్ ధృతరాష్ట్ర మహీశుఁ డాత్మ న
త్యంతముఁ [4]దేటి నన్నిట ప్రి - యంబునఁ బంచెడు నప్డు నాకుఁదే
రెంతయు వేడ్కఁ ధాన వెర - వేర్పడఁ జెప్పుచుఁ బన్నఁ బంచెని
ట్లింత ఘటించెఁ బొందు మన - మీపదనం దెలి వొందఁగాఁ దగున్

1. గోర 2. వీఁడె 3. మొ౹డించి 4. డీఱ

చులుకని కార్యము సేయం
దలఁచుట మీాయట్టి సర్వ - ధర్మజ్ఞులు శాం
తులు ననఁ బ్రసిద్ధులగు పె
ద్దలకుం దగ వగునె యెవ్వి - ధంబునఁ [1]జూడన్ 37

మఱుఁగుఁ జీర యందు - మసి దాఁకినట్లు మీా
సత్కులమునఁ గల్మ - షంబు గౌర
వేంద్రు కతనఁ బొందె - నింతయుఁ బాపంగ
నీవ నేర్తు [2]కార్య - నిపుణ హృదయ. 38

అఖిలజనక్షయం బయి జ - యాపజయంబులు రెండునుం దుదిన్
సుఖములు గాని యాపనికిఁ - జొత్తురె యుత్తము లట్లుఁగాక యా
నిఖిల సుఖంబు లేమిటికి - నీ వని వృద్ధజనంబు బాలురన్
సఖులను బంధులన్ గురులఁ - [3]జంపిత యేని దయాపయోనిధీ.

పెట్టని కోట నీకు హరి - భీముఁడు నర్జునుఁడున్ రణంబునం
దొట్టిన మంటలా కొలఁది - యోధుల సాత్యకియున్ విరాటుఁడుం
జుట్టపు మేరు వుగ్రరణ - శోభితుఁ డీద్రుపదుండు నిన్ను ని
ట్టట్టన వచ్చునే సురల - కైనను నొల్లవుగాక చివ్వకున్. 40

మఱియు నక్కడ 41

ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు- ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణము లానుయోధనుని - పాలివయంద్రు నిజాను జన్మల
క్షీణ పరాక్రముల్ [4]సుతుల - జేయులు బాహ్లిక సోమదత్తు లా
స్థాణునకైన నోడరు వ - శంబె జయింపఁగ వారి నేరికిన్ 42

---

1. దలఁపన్ 2. ధర్మ 3. ఱంపుదమే౦ 4. గలర జేయులు

అధిప యిట్టి మీకు - నన్యోన్య కలహంబు
నాకుఁ జూడ మేల - నంగ రాదు
రెండు పక్షములకుఁ - బ్రియము హితంబును
నాత్మఁ గోరు వారి - నడిగి చూడు. 43

అని పలికి సూతనందనుండు గొలువు గలయఁ గనుంగొని 44

మ్రొక్కెద వాసుదేవునకు - మోడ్చెదఁ జేతులు సవ్యసాచి కిం
దక్కటి మిత్త్రబాంధవ హి - తప్రియ మంత్రి వయస్యకోటికిన్
స్రుక్కుచు విన్నవించెదన - సూయలు దక్కి యనుజ్ఞ సేయఁడీ
యిక్కరుణాకరున్ శరణ - మే నిదె వేఁడెదఁ గ్రోధ శాంతికిన్ 45

అనుచుం బ్రణామ పూర్వకంబుగాఁ బాండవాగ్రజు వదనంబునం జూడ్కి నిలిపి దేవా యుపశమించుట లెస్స యిమ్మెయికిం గురుపితామహుండును సంతసిల్లు నాతనికి మతంబయిన తెఱంగు సర్వలోక సమ్మతంబగు నన విని ధర్మనందనుం డిట్లనియె. 46

నెయ్యము దప్ప నొండొకటి - నీచెవి సోఁకెనె నాదు పల్కులం
దియ్యెడ సంజయా ! యనికి - నిమ్మెయి నల్కెదు నీవు మాకుఁజాఁ
గయ్యము దక్కి మన్కితగు - కార్యము గాదొకొ పోరితంబులే
కయ్యెడు నర్థసిద్ధి వెడఁ - గైనను నొల్లక యొండు సేయునే 47

జనులకు నెల్లను బథ్యము
లనఁగా ధర్మానుగతము - లగు ననఁ బొగడం
జనుపనులు సేయు భీమా
ర్జునులే దుష్కర్మమునకు - రోయనివారల్ 48

మది సుఖము కోరి దుఃఖం
బొదవం గల కార్యములకు - నుత్సాహము సే

యుదు రొప్పని తృష్ణం బడి
చదు రేమియు లేని యట్టి - జను లాతుసులై. 49

యోగ్య [1]తృష్ణవారు - లుచితంపుఁ గొలఁది మై
నడచినట్టివారు - బెడిదములకు
నంత పొత్తురెట్లు - సంతాపకారుల
కాక పెనఁ కువలును - ఖంబు లగునె. 50

భోగంబులు వలదా యని తలంతు మేని 51

వస మాల్యాను లేపనా - వసరములును
జతుర తూర్యత్రయంబుల - సమయములును
నేము వెలిగాఁగ మాతండ్రి - కించునెట్లు
పుత్రులన పట్టి మమ్మేల - పోవఁద్రోచు. 52

అయినను నొక మాట సెప్పెద సమచిత్తుఁడవై వినుమని యిట్లని యె. 53

[2]తానైన నపుడు వక్రుం
డై నీతి పథంబు విడిచె - నక్కట పతి మ
మ్మైనను జక్కని తెరువునఁ
బాని నడవుఁడనుచు నిపుడు - బుద్ధులు సెప్పెన్. 54

ఎదిరిం దమయట్టుల కా
మదిఁ దలఁచినఁ బొనఁగుఁ గాక - మాకుం [3]గుడు మిం
డిదె మీరు వ్రక్కఁ గొనుఁడని
చదు రడిచిన మనను పొందు - చక్కం బడునే. 55

1. తృష్ణఁదగిలి (యుచితంపుఁబోడిమై) 2. తానైనఁ బుత్రునకు వకుఁడై
3. గుడమిం

అని చూపి చెప్పి వెండియు 56

సంపద దక్కియుండఁగ న - శక్తులనం జనుమమ్ముఁ బిల్చి పూ
జింపఁగ నంత బేలె పతి - సెప్పెడు వారలబుద్ధి నాఁక మ
న్నింపఁడ యింక నేల యగు - నీ వడియాసల వచ్చి రిత్తగా
రింపక మాను మాతని చ - రిత్రము నీకును మాకు వింతయే 57

తగు మాట లాంబికే యుం
డగు నని కైకొనునె యెన్నఁ - డైనను గొడుకున్
మగఁటిమి గలఁడనియెడు న
మ్మిగఁజూచుచు నుండు విషము - మ్రింగిన యేనిన్. 58

జూదపు సిరి యాస పడం
గాదని విదురుండు సెప్పఁ - గా నప్పుడు క
ర్ణాదుల పలుకులు విని పతి
యాదరణము సేయకున్న - నంతన తీరున్. 59

ధృతరాష్ట్రుండిట మీఁదను
సుతులును శకునియును సూత - సుతుఁడును ధననే
గతి నడపించిరి వారల
మతమ యనుష్ఠించుఁగాక - మరలం బడునే. 60

కార్యము తెలఁగిట్టిది నీ
వార్య చరితమునకుఁ జొచ్చి - యాడెదు నీకా
దుర్యోధను నవినయ మని
వార్యం బని యెఱుఁగరామి - వలనో వెఱఁగో. 61

చక్రధరు లెక్కగొనఁడు ప
రాక్రమ నిధి యర్జునునకు - రాధేయ భుజా

1. నెమ్మిగ.

విక్రమ మెదురుగఁ గొని ని
ర్వక్రముఁ జేసి కొను వాఁడు - రాజ్యంబెల్లన్. 62

అని పలికి వెకవెక యలుక వొడమిన మఱియు నిట్లనియె. 63
చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు న - శ్వత్థామయుం గర్ణుఁడున్
భూపశ్రేష్ఠుఁడు [1]వారు మున్నెఱుఁగరే - పోరెట్లుఁ గయ్యంబు లా
శాపాశంబులు చుట్టలా వెఱఁగియుం - జా వేఁడి మార్కొందు రిం
తే పో తమ్ముఁ గపిధ్వజప్రభల యం - ధీ భూతులం జేయవే.

మును మమ్ముఁ బొగడి పదపడి
యని వారల గెలువ నరిది - యని పొత్తుగఁ జె
ప్పిన మాటకు నే నొడఁబడ
విను సంజయ ! పక్షపాత వృత్తి విడువు మీ. 65

గాండీవజ్యారవంబు - తక్కటమయి పెలుచం - గ్రమ్మినన్ భీము బాహా
దండం బేపారి శుంభ - ద్గద జడియుచు రౌ - ద్రంబుగాఁ దోఁచినన్ వే
దండ ద్వంద్వంబు మాడ్కిం - [2]దఱిమి కవలు మా - ద్యద్గతిం దాఁకినం [3]జా
కుండం బోకుండ గౌర - వ్యులకు వశమె బి - ట్టుల్కి మూర్ఛిల్ల కుండన్. 66

కావున 67

రణముల వారలన్ గెలువ - రా దను పల్కు లటుండనిమ్ము స
ద్గుణుఁడవు నీవు వచ్చితి ప్ర - కోపశమంబుగఁ బల్కితింక సై
రణ దగఁజేయు వారము ప - రాభవ మొందియు మున్ను వారిదు
ర్గుణములు సైఁచు టీవు నొక - కొంత యెఱుంగుదు వింతయేటికిన్

1. దాను మున్నెఱుఁగఁడే 2. దఱిమిడి కవలు ద్యద్గతిం 3. రాకుండం

దుర్ణయ వృత్తి దు - ర్ద్యూతంబు పుట్టించి
యంతలు సేసిన - యట్టివారి

నేల గర్వంబు సెల్లంగ - నిచ్చి జగము
చేతఁ దిట్టులు వఱసట్లు - సేసి పోయి
తేల యడవుల నిమ్మెయి - నిడుము గుడిచి
తేల తాల్మియ ధనముగా - నింత వడితి. 74

తుదిఁ బోయి క్రూరకర్మా
స్పదమగు తెఱఁగునకు జొచ్చి - బంధుల గురులన్
వెదకి వధియించు సౌఖ్యం
బది యేటికి నార్య నింద్య - మస్థిర మరయన్. 75

అల్పులకు మ్రింగఁ జేఁదైన - హాల హలము
భంగిఁ బొంగెడు కోపంబు - మ్రింగి కొనఁగ
నీలగళు నెన్ని నిన్నెన్నఁ - బోలు నట్టి
నీవు సాలినఁగా కేల - నెగడుఁ బేరు. 76

అనవుడుఁ బాండురాజు తన - యాగ్రణి సంజయు మోముఁ జూచి యి
ట్లను నది యెల్ల నీ పలికి - నట్టిద ధర్మువు లట్ల యుండి బో
ధను లరయంగ వచ్చిన న - ధర్మములై చెడుఁ గొన్ని ధర్మవ
ర్తనములు గాక తోఁచి తుది - ధర్మములై చనుఁగొన్ని [1]కర్మ
ముల్. 77

కావున నన్ను దూఱఁ దలంచితేని నాచేయునది ధర్మం బధర్మం బని నిరూపించి మఱి దూఱుము కోపంబు నివారింపందగు నహింసయ యుత్తమ ధర్మంబగు నట్లయినను వంశ దూషకులును లోక కంటకులును

1. కర్మముల్. ధర్మముల్

నగు పాపాత్ముల నిర్మూలంబుగాఁ జెఱచుట ధర్మంబని పెద్దలచేత విందు ముది యట్లుండె సంగ్రామంబు రాజులకు ధర్మం బవుం గాదని నీవ చెప్పు మట్లుంగాక యిది కర్తవ్యం బిది యకర్తవ్యం బని మనల శాసింప వాసు దేవుండు గలండు. మనకీ వితర్కం బేటికి నితండు ధర్మాధర్మ విదు లకును గురుండు గార్యా కార్య నిరూపకులకు శిక్షకుండుచితానుచితజ్ఞులకుఁ బ్రదర్శకుం డితని పంపునం గాదె యదు భోజాంధక వృష్ణి సంజయ శైశయ ప్రభృతి భూపతి ప్రకరంబు ప్రశస్త పథంబునం బ్రవర్తిల్లు చున్నయది విశేషించి మాకు నితని బుద్ధియ సమస్త పురుషార్థమ్ములకు మూలంబగుట నితని వచనం బవశ్యంబు నలంఘనీయం బనిన విని జనా ర్దనుండు సంజయున కిట్లనియె. 78

పాండు తనూజకోటికి శు - భం బెడఁ గోరుదు [1]నెప్డు నాంబికే
యుండును బుత్రపౌత్ర మహీ - మోజ్జ్వలుఁడక్కట! చేటు మేలె యం
చుండుదు నట్లుఁగాక తెలి - వొంది యతండిట వీరిఁదేర్పఁగా
నిండు మనంబుతోఁబనిచె - నిన్నని దీనికిఁ బ్రీతిఁ బొందితిన్ 79

నీవు నుచిత వృత్తి - నెయ్యంబు ధర్మంబు
వినయ మొప్పఁదెలిపి - వీరు శాంతిఁ
బొందు నట్టి భంగి - బొసఁగఁ బల్కుటయును
నాకు సమ్మదం బొ - నర్చె నిపుడు. 80

అనఘ! యిట్టులంత - యును దలఁపం గడు
నెనసినట్టు లుండె - నేని వింటే
పొంప వాగ్గ జన్మ - పలుకుల చందంబు
సూడ సంధి లేని - చొప్పు దోఁచె. 81

---

1. నేను

అది యట్టిద సంధానము
దుది నెమ్మెయిఁ [1]గల్గు నెట్లు - దుర్యోధనుఁడు
న్మదుఁడు ధృతరాష్ట్ర భూవిభు
హృదయంబు తెఱంగు గొంత - యెఱుఁగుదుము గదా. 82

ఆరాజు సేయు నెయ్యము
గారామును జెప్పె దీవు - గడుఁ దీపులు గా
వీరు దమపాలు వడయక
నేరిమ మాటలన దీర - నేర్తురె చెపుమా. 83

వీరలు పెద్దద్రవ్వకొక - వెంట నొడంబడి తేఱి శాంతులై
కౌరవ కోటిఁ గూడి మనఁ గా మదిఁ గోరుట పెంపుఁదాల్మియుం
గారుణి కత్వముం దగవు - గాదె జగంబున పాడి తండ్రి పా
లీ రని తెంపు సేసి పయి - నెత్తిన నెత్తిరి గాక ద్రోహమే. 84

విను మవమానము పడి యి
ట్లునికిఁ బడయు [2]తొగడు కంటె - నుజ్జ్వలులై మా
ర్కొనిన నది లెస్స యెట్లయి
నను వీరికిఁ బోటు మేలు - నాకుం జూడన్. 85

సంగ్రామంబు రాజులకు ధర్మం బవుం గాదని నీవ చెప్పుమని యుధిష్ఠిరుండు నిన్నడిగెఁ గదా ద్విజాతులకు యజన యాజనాది కర్మ కరణ విభాగంబు ధర్మశాస్త్రాచార్యులు విధించు నప్పుడు రాజు లిచ్చువారు గాని వేఁడుకొనువారు గారని చెప్పుట సకల లోక ప్రసిద్ధంబు సర్వవర్ణా శ్రమ ధర్మ పరిపాలనంబు సేయునట్టి రాజులు దార నిజ ధర్మంబు వద లుదురా యదియుంగాక పాడితోడి యార్జనంబునం దమకుఁ గలకలిమి యనుభవించుచు సత్పథంబున నడచుచుండఁ దమ్మొరులన్యాయంబు

1. గలుగనేర్చు 2. పొగడు

సేసిన యప్పటికిం గదా యా శస్త్రాస్త్ర ధర్మంబు లింద్రాదులగు పెద్దలు గావించిరి. నీ చెప్పెడి ధర్మంబులు గౌరవులకుం జెప్ప వలదా వారలు గదా మీఁదెఱుంగక కొంటెత నముకులై చెడు తెరువునం బోయెడు వారని పలికి మఱియు నిట్లనియె. 86

నెట్టన సభలో వేవుర
కట్టెదుర నరాతి తనముగా - కెంలయు వా
రెట్టి తులువలో ద్రౌపది
[1]నట్టులు పఱిచెడిచె జూద - మాకరె యెందున్. 87

అనవుడు సంజయుండు దేవా నీచిత్తంబున నిడి దీని నింత గొని యాడినఁ గర్జం బొదఁ గూడునే యనిన వాసుదేవుం డిట్లనియె. 88

అత్తఱి భీష్మముఖ్యులగు - నచ్చటి వృద్ధజనంబు లెల్ల నో
రెత్తక యూరకుండిరి మ - హీశ్వరు చిత్త మెఱుంగకున్కిఁగా
నొత్తి కుమారులం గినియ - నోపఁడ యక్కట ! మాన్పఁగన్నవా
చిత్తమ కాదు లోకముల - చిత్తము లెల్లను నంశసింపవే. 89

[2]తిట్టులఁ బోయి యక్కొ్కలువు - తేఁకువ వారల లోని కెంతిఁ దా
నట్టులు దుస్ససేనుఁడద - యాక్కతి ముందల పట్టి యీడ్వఁగా
నెట్టు సహించె మామ నతి - యేడ్పు తెలుంగున కెట్టు లోర్చె నీ
పట్టున సేమ మారయఁగఁ - బంచుట కెట్టులు నేర్చెఁ గ్రమ్మఱన్ 90

ఇది దగ దంచు నడ్డపడు - నింతకు నేరక సభ్యులందఱున్
మది మఱగొన్న యట్టియెడ - మానినికిం దనుఁదాన కాచికో
లొదవిన దానఁ జేసి సభ - నొచ్చెము దక్కినఁబాండు నందనుల్
బ్రదికిరి గాక యయ్యెడరు - రాచకుమారుల [3]కోర్చునట్టిదే. 91

1. నట్టేల 2. తిట్టులకోర్చ 3. కోర్వవచ్చునే

సంజయా వినవే యప్పుడు సభాసమంకుఁ గర్ణకూలంబులగు నట్లుగాఁ గర్జించు. 92

లే దిచట మగలు సికను
వీ రలు జూదమున నోడి - విడిచిరి నిన్నున్
వారిజలోచన నీపైఁ
గూరిమి గలమగని వెదకి - కొను మెుర నవఁడే 93

నరునకు నది వాఙ్మయ మగు
శరమై హృదయంబు నాఁటి - చలియింపక దు
ర్భర వేదనఁ జేయంగాఁ
జిర కాలము దచ్చికిత్స - సేసెనె చెపుమా 94

మఱియు దుశ్శాసనుండు వీర లందఱును గొడ్డుపోయిన వారలు పౌరుషంబు గలమానిసి యిందెవ్వఁడనియె నతని చెప్పినట్లు పెద్ద గాలంబేని వీరల గొడ్డువోయిరి కాక వీరిదెన వారికి నేమి ఫలించె వెండి యుఁ దత్సమయంబునఁ బుట్టిన మాట లుగ్గడించు నట్టివిగా వీ సంధి కార్యం బత్యంత దుర్ఘటంబు దీని ఘటియింపం జేయుట యశక్యం బని తలంచెద నయినను 95

పాండవేయులఁ దగం - బ్రార్థించి యంపుల
కక్కట! యేనైన - నరుగు దెంచి
కౌరవులకు బుద్ధి - గాఁజెప్పి రాజ్యంబు
పాలుసేసిన మృత్యు - పాశములకుఁ
దప్పరే వారలు - దగవును నేర్పును
నామీఁద నిలుచుట - నాకుఁ గీడె
నన్ను మన్నింతుర - న్యాయంబు సౌరనినా
మాటకుఁ [1]దారొాఁ - బాటు లేక

1. దారొడ

యుండుదురె కేసరము లాడ - నుండిరేనిఁ
గవియు పాండవ బాణాగ్ని - గాఁచు నవ్వె
దమ్ముఁ దమలోభ మను చిచ్చు - దరి కొనంగఁ
వెగిన వారలు పోదురిం - తియు తలంప. 96

అనిపలికి వెండియు నిట్లనియె 97

రోషమయ మహాత - రువు సుయోధనుఁడు
స్కంధ మందు రోసఁ - గర్ణుఁ [1]డలరుఁ
గొమ్మ సౌబలుండు - కుసుమ ఫలములు దు
శ్శాసనుండు మూల - శక్తి తండ్రి 98

ధర్మజుండు ధర్మ - తరు వర్జునుఁడు ఘన
స్కంధ మనిలసుతుఁడు - శాఖ కవలు
పుష్ప ఫలము లేను - భూసురులును వేద
ములుఁ దదీయ మైన - మూల చయము. 99

ఈ రెంటి యందు నరసి య
సారం బిది గాఢసార - సహితం బిది నా
నేర వలయు నదియును గా
కేరూపం బయ్యె [2]నేని - నీ సేమిటికిన్. 100

ధృతరాష్ట్రుండును బుత్రులున్ వనము గుం - డేసందముల్ సింహ
ముల్
మతి నూహింప నసింహమైన వనమున్ - మర్దింతు రెందున్ ఘనా
వృత వృత్తంబులు గాని సింహములకున్ - వేగంబ చేటొందుఁగా
న తగం బొందుట కార్య మీ యుభయము - న్పంటపష్టిపై నున్కి-
కిన్ 101

1. దరయ 2. నేమి యీ సేమిటికిన్

నీవొండె విదురుఁ డొండెను
గా వలయుం గాక యిట్టి - కార్యంబులకున్
రావేల కలరె తగువా
రీ వినయము నేర్ప గలదె - యితరుల కెందున్. 107

అరిగినయప్డు పెద్దలగు - నందఱి విప్రుల నెల్లఁగాంచి యా
దరమున వారి సేమ ముచి - తంబుగ నారసి వెండి కాన్పు మీ
గురునిఁ బితామహుం - గృపునిఁ గూర్తురు వారలు నాకు నానమ
స్కారణము గాఁగ వారి కధి - కప్రియ భక్తి నమస్కరింపుమీ.

మా తండ్రి గని యేను - బ్రీతి మ్రొక్కుట గాఁగ
దండ ప్రణామంబుఁ - దగ నొనర్పు
దుర్వృత్తిఁ బోరయునా - దుర్యోధనుని సేమ
మడిగితి నని చెప్పు - మతని తమ్ముఁ
డగుటకుఁ దగియెడు - నా దుస్స సేనుని
కుశల మారయుము ద - క్కను గుమార
వర్గంబు నెల్లను - వనితా జనంబుల
నుచితంపుమై సుఖ - మున్కి యడుగు

విదురు శల్యుఁ గాంచి - వినయంబు దోఁపంగ
నాడు ద్రోణ తనయు - నక్క సేర్చి
కొంటి నను మ బాహ్లి - కుని సోమదత్తు భూ
రిశ్రవసునిఁ దలఁచి - ప్రియము నెఱపు. 109

మఱియు వంశవంతులు వయోవృద్ధులు నగు భూపతులను గృత వర్మను గర్ణశకుని సైంధవ ప్రభృతులను దక్కటి రాజ లోకంబును గయ్యంబునకుఁ దోడు వచ్చిన సకల దేశాధీశులనుం గని యెవ్వరితోడ నెవ్విధంబునం బలుకందగు ప్రణామ వినయ బాంధవ మైత్రీ వాత్సల్యం

బులకు నర్హంబౌ ప్రకారంబుల మృదువచనంబులుగాఁ బలికి యుచితంబు
మెయి నుపచరింపుము. 110

దాసీ దాసజనంబులకు కు
దాసీనము గాక యుంటఁ - దనయుల యేమీ
త్రాసంగ మొంది శత్రుని
వాసం బొనరించి తమ్ము - నరసెద ననుమీ 111

పోయిన మొగమున నచ్చటఁ
జేయు తెఱంగెల్ల నీకుఁ - జెప్పితిఁ బిదపన్
మా యయ్య పెద్దకొలువున
నా యోపిక యుట్టినంగ - వలయుం జుమ్మా. 112

అనఘ భవద్బలంబునన - యాపద యింతక లేక పాండునం
దనులు నిజాప్తబంధునహి - తంబు [1]సుఖస్థితి నున్నవారు త
జ్జనకుని రాజ్యపీఠమున - సమ్మద మొందఁగ నిల్పి శైశవం
బునన ప్రభుత్వమిచ్చి దగఁ - బ్రోచితి వారల విశ్రుతంబుగన్.

ఇప్పుడుపేక్ష సేసి కృప - యేమియు లేక విహీన వృత్తి వా
రొప్పమిఁ బొందఁ జూచు - టిది యొప్పునె యింతట సంతసింపరా
దెప్పుడు సంతకంత కట - యెక్కుడు గోరినఁ జాల కుందదే
యొప్పదె కూడి మన్కి మన - కొప్పని వారల యక్కుడక్కగన్

అని [2]తదవసరంబునం బితామహుతో నిట్లనుము. 115

అడఁగఁగ నీక శంతనుని - యన్వయముం గలిగించి తీవయి
ప్పుడు దగనీమతంబునన - పొందొడఁ గూడఁగఁ జేర్చి పౌత్రులన్

1. సుఖంబున 2. తదనంతరంబునం

నడికి నధర్మప్రవృత్తికిని - జావునకుం దొడంగించి మన్నినం
బుడమి జనంబు రాజులును - భూసురులున్ నినుఁ బ్రస్తుతింపరే.

అని పలికి వెండియు 117

ఇంతలు పుట్టిన చోటును
శాంతనునందన యహీన - శాంతి పరుండై
కౌంతేయాగ్రజుఁ డాలము
పొంతం బో నొల్లఁడనుము - బుధపరివృఢకోసన్. 118

ఆసమయంబున - నచ్చటి వారెల్ల
విను నట్లుగా సుయో - ధనుని తోడ
బాహు బలాఢ్యుల - బల విహీనుల క్రియ
వెడలంగ నడిచిన - వెట్టి తనము
నత్యంత చిరకాల - మడవులఁ గొండల
బాధలఁ బెట్టిన - పరుస దనము
సభలోన నట్లు పాం - చాల రాజాత్మజఁ
దల వట్టి యీడ్చిన - తులువ తనము.

ధర్మపుత్రుండు సైరించెఁ - దక్ష్యమీవు
కురుకుమారుల నని ద్రుంగి - కొనకు మెరుల
సొమ్మునకు నాసపడఁ దగ - దిమ్ము వారి
పాలు వారలతోఁ గూడి - బ్రదుకు మనుము. 119

ఏము కలహం బొల్లక పొందు గోరుట తనకు మేలు దన మనంబున దరికొను తృష్ణానలంబు వార్ప నోరు పడ్డంబు పొరమిం జేసి యేన బుద్ధి సెప్పవలసెఁ దన యొద్దంగల యోధవీరు లెయ్యెడల లేమి దెల్లం బయినను మాకుఁ జేదోడు ధర్మంబు గల దదియునుంగాక యఖిలలోక

సేవితుండైన కృష్ణుండు వెనుఁ బ్రాపు గాపునఁ దమకు మమ్ము గెలువం గోరఁడి గాదిది యట్లుండె నేను భీమసేనాదులకుం దమకుం బెద్దవాఁడ నగుట వీరును వారును మదీయ ప్రార్థనా భంగము సేయక నాదగు శాంతియు దాంతియు దెల్లించి సన్నాహజడిఁ బెట్టక పోరితంబుడిగి తమ తమ ధనంబులు గుడిచి సుఖంబుండుట మన పెద్దలకుం బక్కాటి బుద్ధి మంతులకును సంతోషంబగుఁ బెద్ద యాలోచఁ దమ్మునేని కుశస్థలంబును వృకస్థలంబును వాసంతియు వారణావతంబును నాలుఁ గాదేని మఱియు నెందేని నొక్కాటి యగునట్లుగాఁ దన తోఁబుట్టువు లేవురకు నిలువ తావు లయియిచ్చిన సర్వశాంతి యగునట్లయిన నిందఱి యందలి బంధు మిత్త్ర సహాయజనంబులు గలసి సవ్వడుం దెగకుండ నునికి మనమనంబులకుఁ బ్రియంబు సేయుఁ గురుపాండవ యాదవమాత్స్యులు పరస్పర ప్రీతి సంపాదకత్వ సంపన్నులై బ్రదుకుట నాకుం గోర్కి యింతయు నమ్మహాపురుషునకుం దెలియం జెప్పుమనిన విని దేవా నీయానతిచ్చిన మార్గంబంతయు నడపెద మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియం బట్లు సేయువాఁడ గాక యనుచుం బ్రణామంబు సేసిన సంజయునకు ధనంజయుం డిట్లనియె. 120

బాల సఖుండవు [1]నాకును
నీ లెస్సఁ దనంబు నేము - నీతి విదిత సు
శ్శీలుర మగుటయు శైశవ
కేలి మొదలు గాఁగ మనుటె - యెఱుఁగదే నీకున్. 121

బల మర్త్యాకృతి యైన భీముఁ డనుశం - భత్యుంబి సంరంభమున్
నిలిపెన్ వాఁడును నంకుశం బయి తుదిన్ - నేఁడుం దదుద్రేక
మున్
మలుగం జేయ నజాతశత్రుని కృపా - మౌగ్ధ్యంబు చాలంగ వా
రల కేలా నయవిక్రమోచిత విచా - రక్లేశముల్ సంజయా. 122

1. మాకును.

అని పలికి ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారం
బుగా సముచిత ప్రకారంబున మజ్జన భోజనంబు లొనరించి మాల్యాను
లేపనాద్యుపచారంబులు సేయించి మణిభూషణ చిత్రాంబరంబు లొసంగి
వీడుకొల్పిన నతండును బాంధవులను వాసుదేవుని వీడ్కొని చనియెను 123

# 2. కిరాతార్జునీయము

## శ్రీనాథుడు

### హరవిలాసము - సప్తమాశ్వాసము

అర్జునుఁ డింద్రకీలగిరి - యందు రసాల తమాల తాల నీ
పార్జున లోధ్ర తిందుక నవామల పనసామ్ర పాటలీ
సర్జ కురంట కామ్ల హరి - చందన చందన నింబకేతకీ
ఖర్జూర కపిత్థ పూగముఖ - భూరుహపుణ్యాశ్రమాశ్రమంబునన్.

ద్యూత పరాభవమున నగు
చేతో దుఃఖమునఁ దపము - చేయఁగఁ దొడఁగెన్
ప్రాతం యనుమతి శత్రు
వ్రాత జయార్థంబు మది దివ - స్పతి గుఱిగాన్.

ధనురస్త్రంబులు కేలఁదాల్చి శరధి - ద్వంద్వంబు [1]నేర్పార వీ
పున బంధించి కిరీటియై కవచియై - పూనెం దపశ్చర్యయ
ర్జునుఁ డత్యంత గరిష్ఠ నిష్ఠ నమరేం - ద్రుంగూర్చి యయ్యింద్ర
లనగాగ్రంబునఁ బ్రత్యనీక విజయ - శ్లాఘాభిలాషంబునన్.

వంచన మనంబులోన నా
కించుకయును లేక యమ్మ - హేంద్రము మీఁదన్
బంచానల మధ్యంబునఁ
బాంచాలీ వల్లభుఁడు త - పంబొనరించెన్.

గాండీవము తోడ నొక యోగ - దండయష్టి
యస్త్రములతోడఁ గొన్ని ద - ర్భాంకురములు

1. నేపాం

కత్తళము తోడఁ బుండరీ - కంబుతోలు
దాల్చి క్రీడి విరుద్ధపుఁ - దపము చేసె. 5

శాకాహారుఁడు నిర్జితేంద్రియుఁడు పా - షాణాగ్ర తల్పుండునై
నాకేశ ప్రియనందనుండు సలిపె - న్నానా ప్రకారంబులన్
వాకుం జిత్తము దేహము న్సరిమెకా - నానా తపస్సర్యలన్
వ్యాకీర్ణోరగ సింహ భల్లుక లులా - యాభీల శైలాటవిన్. 6

పతయాళు నిర్ఝరాం - భః ప్రవాహంబుల
నఘమర్షణస్నాన - మాచరించుఁ
గొండగోఁగుం బూల - గుండవర్ధనముల
నర్చించు శశలాంఛ - నార్ధమౌళి
స్ఫటికాక్షమాలికా - పాణిప్రవాహుఁడై
జంభారి మంత్రంబు - జపము చేయు
నొంటికాల బుజంబు - నూర్ధ్వంబుగాఁ జాఁచి
తడవుగా నిలుచుండి - తపమొనర్చు

శరభ శార్దూల సింహాది - సత్త్వచయము
కెరలి తనమీఁద బిట్టులం - ఘించునపుడు
కడిమిఁ జెండాడు భుజదండ - గాండివోగ్ర
చండ తరశాత నిర్ఘాత - కాండవితతి. 7

వీరరస గర్భితంబయ్యుఁ - విస్తరిల్లె
శాంతరస మెంతయును సవ్య - సాచియందు
మలయ శైల నితంబ మం - డలమునందు
సర్పవేష్టిత చందన క్ష్మాజమట్లు. 8

ఇవ్విధంబునఁ గపికేతనుండు గాండివ జ్యాఘాత రేఖా కిణకళం
కాలంకారంబులగు కరంబులు నీవారపాకంబునకును బాంచాల కన్యకా

కుచకుంభ కుంకుమ ప్రక్షోద సంప్రేక్షణీయంబైన వక్షంబు రుద్రాక్ష ధారణంబునకును నంగార పర్ణకర్ణ కఠోర హుంకార కారణంబగు కంఠంబు మహేంద్ర దేవతా మంత్రాక్షర ధారణంబునకును ఖాండవ దహన వేళా విజృంభితావష్టంభ సంరంభంబగు హృదయాంభోరుహంబు ప్రణవోపలంభంబునకును గుంభసంభవ ప్రదిష్ట శాఖా శిఖర పక్షిలక్ష్యావ లోకన జాగరూకంబగు వీక్షణంబులు నాసికా ప్రదేశాను సంధానంబునకును యంత్ర మత్స్య విభేద నోపాయ సందర్శన ప్రభావ సంసిద్ధియగు బుద్ధి వృద్ధోప సేవనంబునకును గంగాజల నిగ్రహానుగ్రహోపాదన సమగ్రం బగు మానసోత్సాహం బింద్రియ భంగంబునకును నుత్తర దిగ్విజయ యాత్రాధురీణంబులగు చరణంబులు తీర్థగమనంబులకును బాల్పడఁజేసి జగజెట్టి బిరుదు నెట్టుకొనం దంద్రిగుఱించి తపంబుఁ జేయుచుండ దినం బులు గడచె వారంబు లరిగెఁ బక్షంబులు సనియె మాసంబులు వోయె ఋతువు లతిక్రమించె సంవత్సరంబు దాఁటె నయ్యవసరంబున 9

తెల్లని గడ్డంబు - తెల్లని మీసము
ల్లారసిన రోమపాం - డుర శిరంబు
మేధావి బొట్టును - మెఱుఁగు జన్నిదములు
భూతి లలాట త్రి - పుండ్రకంబుఁ
గావిదోవతియును - గంధోత్తరీయంబు
నిష్టికోలయుఁ జంక - నిట్టితోలుఁ
బంచాంగ ముష్టియుఁ - బాణి పవిత్రంబు
నొక్క వ్రేలికి వెండి - యుంగరంబు

జాలుబొజ్జయుఁ [1]గుశదర్భ - సంబెలయును
నెడమ [2]చేతను నిడుగోల - గొడుగుదాల్చి

---

1. సనుదబ్బ 2. చేలను

తనకు సజ్ఞాతిగా నొక్క - తపసివృద్ధ
బ్రాహ్మణుడు వచ్చె నొయ్యొయ్య - బార్థుకడకు. 10

వచ్చి యాశీర్వదించి మహాత్మా! నీ సంగడంబునం దపంబు చేయవచ్చితి నిచ్చోఁగొన్ని దినంబులు క్రూరజంతువులు నన్ను బాధింప కుండ నరసికొని యుండవలయునని పల్కి యతని ముందటఁ బరిశ్రాం తుఁడుం బోలెఁ జతికిలంబడి కూర్చుండి. 11

మోఱకుని చందమున నీఱ - తాఱచూపు
పాండవేయునిపైఁ దార్చి - బ్రాహ్మణుండు
పలికె నిష్ప్రచ్ఛదం బైన - భాషణములఁ
పరమనాస్తిక భావంబు - పరిమళింప. 12

అన్న! యెవ్వరివాఁడవీ - యడవిలోనఁ
దపము సేసెదు నీ మంత్ర - తంత్రవిధులు
పాకశాసన దేవతా - ప్రార్థనైక
సూచకము లైనయవి యెన్ని - చూడనిపుడు. 13

చక్కనివాఁడ వెంతయును - జల్లనివాఁడవు భాగ్యరేఖఁ బెం
పెక్కినవాఁడ వీ విపిన - మెక్కడ నీ సుకుమారతా గుణం
బెక్కడ ఘోరవీర తప మీ - యెల ప్రాయమునందుఁ జేయునే
యక్కట యెవ్వఁడైన నకృ - తాత్ముఁడ వీ వొకరుండు దక్కఁ
గన్. 14

శరచాపధారణంబున్
బరమ మనశ్శాంతి దాంతి - పరిపాకంబున్
బరికింపఁ "జంక దుడ్డును
శరణార్థియు" ననెడు నట్టి - చందము దోచెన్. 15

వైరి మదకుంభి కుంభ వి
దారిణ దారుణ కృపాణ - ధారలు పరిహా
కారములు కంపమూరో
ద్ధారముంకుఁ బాలుపడెఁగ - దానికరముల్. 16

ఈ భద్రాకృతి యిమ్మహాభుజ యుగం - బీ దీర్ఘకోదండ మీ
యాభీలన్వి మొకండొ కొండభువనై - కాధ్యక్షతా హేతువే
లాభం బాత్మఁ దలంచి చేసెదొకొగో - లాంగూల భల్లూక మ
త్తేభాకీర్ణ వనాంతరంబునఁ దపం - బేకాగ్ర భావంబునన్. 17

ఈశ్వరునిఁ గూర్చి చేసెద - వేని లెన్స
మాధవుని గూర్చి చేసిన - మాకు హితవు
బ్రహ్మఁగూర్చి చేసిననది - [1]ప్రార్థ్యకరము
లగునె యిల వజ్రధరుఁగూర్చి - దపము సేయ ? 18

ఎవ్వఁడుపదేశ మిచ్చె నీ - కింద్రుఁగూర్చి
తపము సేయుము నీవంచు - దయదలిర్ప
నాతఁడెఱుఁగ డొకొకయా - యద్రిభేది
గౌతముని యింటజేసిన - కామగోష్ఠి 19

ఆ సహస్రాక్షుని - యాత్మసంశుద్ధికిఁ
బరమ సంయమియింటి - పంచసాక్షి
యానిర్జితేంద్రుఁబా - హావిక్రమమునకు
భుజగాంతకుని యాఁక - పోకసాక్షి
యామునాసీరున - హంకారగరిమకు
నిషధాచలము మీఁది - నెలవు సాక్షి

1. పరిమరమము

యాశచీవల్లభు - నౌచిత్య కలనకుఁ
దాపసు చేతి పూ - దండసాక్షి

యిట్టి దేవేంద్రు గూర్చినీ - వింత తపము
చేసిపడసెద వేమివాం - ఛితఫలంబు
వాఁడు నీకంటెనేమిట - వాసి గలఁడు
తగదు చాలింపుమీ విరు - ద్ధంపుఁదపము. 20

అని యెంతచెప్పిన నత్యంత ధీరోదాత్తుండగు పాండుపుత్రుం డూరక తపంబు చేయుచుండె, నట్టి యేకాగ్రభావంబునకుం బ్రియం బంది వృద్ధబ్రాహ్మణ వేషంబుమాని వృద్ధశ్రవుండు ప్రత్యక్షంబై వరంబు వేఁడు మనుటయు. 21

గురు భీష్మ కర్ణసైంధవ
గురు తనయులతోడఁ గూడఁ - గురుపతి బలము
న్బరిమార్చునట్టి సత్త్వముఁ
బురుహూతా ! యిమ్ము కరుణ - బొంపిరిపోవన్. 22

అనిన, నింద్రుండు సవ్యసాచి కిట్లనియె. 23

భీష్మ గురుకర్ణ కృపులని - ర్భేద్యబలులు
ద్రౌణి భూరిశ్రవోభగ - దత్తశల్య
సైంధవులు పేరుగలవారు - సమరజయము
శంభుకృపలేక యెబ్బంగి - సంభవించు. 24

పశుపతింగుఱించి తపంబు సేయుము తత్ప్రసాదంబున నీకుం జయంబయ్యెడుఁ బునర్దర్శనంబు గాఁగలయది పోయివచ్చెదనని యింద్రుండంతర్ధానంబు చేసె. 25

తం౦డ్రి చెప్పిన మాట [1]లౌఁ - దప్పునాక,
యాదరించి ధనంజయుం - డభవుఁగూర్చి
యింద్ర కీలాచలంబుపై - నేకనిష్ఠ
తీఁడుఁడొనరించె నతిఘోర - వీరతపము. 26

భసితోద్ధూళిత నిర్మలావయవుఁడు - న్పంచాక్షరీ సంతతా
భ్యసన వ్యాప్తిపరాయణుండును శివ - ధ్యానాను సంధాతయున్
మసృణస్నిగ్ధతరక్షు చర్మమయకం - ఛాభద్ర పీఠుండునై
యసమ స్థేమఁగిరీటి పాశుపతదీ - క్షారంభమున్ గైకొనెన్. 27

ప్రథమ సంధ్యారాగ - పరిపాటి మిన్నేటి
కనక పంకజకోర - కములు దెలుపఁ
గండు వారిన మించుఁ - [2]గంచుటద్దముపోలె
విధుమండలము కాంతి - వీడు కొనఁగ
దరమైన వేఁబోక - తఱపి వెన్నెలఁగ్రోలి
దివిఁ జకోరములు మ - త్తిల్లి యాడ
మందరాచలకూట - మధ్యభాగమ్మునఁ
గృత్తికా నక్షత్ర - మత్తమిల్ల

మృదుల భస్మరజశ్శయ్య - మేలుకాంచి
యమల రుద్రాక్షధారణం - బాచరించి
యర్జునుఁడు పర్ణశాలికా - భ్యంతరమున
హరున కొనరించు నరుణోద - యార్చనంబు. 28

కపికేతుఁ డింద్రకీల
ప్రపాత పత యాశునిర్ఝ - రస్నాతుండై

---

1. లుపప్పకప్పు, హాదరించి 2. గచ్చుటద్దము

యుపచార విధుల నన్నిటఁ
దపనోదయవేళ వ్యాళ - ధరుఁ బూజించున్. 29

అవధానంబునఁ బాకశాసనసుతుం - డర్ధేందు కోటీరు సం
గవకాలంబునఁ బూజసేయు హిమవాః - కర్పూర కస్తూరి కా
ద్రవకాలాగురు గంధసార సురభి - ద్రవ్యంబులం బూవుల
న్లవలీ సర్జర సాగురు ప్రముఖనా - నాధూప ధూమంబులన్ 30

పంచబ్రహ్మ షడంగ బీజసహిత - ప్రాసాద పంచాక్షరీ
చంచన్మంత్ర పరంపరా పరమని ష్ఠాతత్పర త్వంబునన్
మంచుం గొండయనుంగుఁబెండ్లి కొడుకు - న్మధ్యాహ్నకాలంబు సే
వించు న్నిర్జర రాజసూనుఁడు మనో - వీథీ సదాధ్యాసితన్. 31

వైయాఘ్రాజినఖండ మధ్యమున తే - వన్ బద్ధ పద్మాసనుం
డా యింద్రాత్మజుఁ డింద్రకీలశిఖరీం - ద్రా రూఢ బిల్వద్రుమ
చ్ఛాయా నిర్మల చంద్రకాంత మణిపా - షాణ ప్రదేశంబున
న్సాయంకాలము పూజసేయు నభవు - న్సంధ్యానటున్ ధూర్జటిన్

అంచిత భక్తితో శివుని - నర్ధనిశాసమయంబునందు సే
వించు గురూపదేశ పద - వీపరిశుద్ధ సమర్చనా విధిన్
గాంచన కోరకంబుల [1]శుకప్రసవంబులఁ గొండగోఁగులన్
గాంచన కందరాగృహము - ఖంబులఁబార్థుఁడు సంస్కృతార్థుఁడై

ఇట్లు పాశుపత దీక్షాధురంధరుండై కాలకంధరుంగుఱించి తపంబు సేయుచుండఁ గొండొక కాలంబునకు 34

ఒక నాఁడింద్ర తనూభవుండు గిరికూ - లోత్సంగ భాగంబున
న్వికచానేక లతాతరు ప్రతతులన్ - దేవార్చనా పుష్పకో

---

1. శుక ప్రసవంబుల

రకము ల్గోయుచు నుండఁగా వినఁబడెన్ - శ్రవ్యంబులై కుర్కుర
ప్రకరోదంచిత కంఠనాళ కుహలీ - బౌబౌ మహారావముల్. 35

[1]శరభ మృగములకంటె గే - సరులకంటెఁ
బులుల కంటెను [2]బిసరులై - పొగరు మిగిలి
జల్లుకొని వచ్చెఁ బైపైని - సారమే య
యూధములు వేదమయమూర్తు - లుద్ధతముగ 36

ప్రకటలీల నుదాత్తంపు - ఫణితిఁ గొన్ని
క్రమముతో ననుదాత్తస్వ - రములఁ గొన్ని
స్వరితములఁ బ్రచయంబుల - వరుసఁ గొన్ని
ఘోషణము సేయఁ దొడఁగె నా - కుర్కురములు. 37

కనకపు శృంఖలలఁ బ్రదయా
శునకంబులఁ బట్టుకొనఁగ - సూరెలఁ బ్రమథుల్
తను నిరుచక్కియ లీలా
వనచరులై కొలువఁ గపట - వైహారికుఁడై. 38

వికట పాటలజటా - మకుటికా భారంబు
కలికైన జంజూటు - నెఱులుగాఁగఁ
జారు సుధాధామ - శకలావతంసంబు
పెడకొప్పు పైనుండు - పీఁకెగాఁగ
ఘనలలాటంబునఁ - గనుపట్టు కనుచిచ్చు
గైరిక ద్రవ తిల - కంబుగాఁగఁ
భుజ మధ్యమునఁ గ్రాలు - భుజగ హారంబులు
గురిజ పూసల గుబ్బ - సరులుగాఁగ

1. చాయగోసుల 2. బిరుసులై

శంకరుండు గిరాత వే - షంబు దాల్చి
యగజ చెంచెతయై తోడ - నరుగుదేరఁ
బాణి నోంకార దివ్య చా - పము ధరించి
వచ్చె వివ్వచ్చు వరతపో - వనము కడకు. 39

అట్టి సమయంబున 40

జలధర నీల దేహమును - జంద్రకళా యుగళీసమాన దం
ష్ట్రలు భిదురోపమానముఖ - సంపుట పోత్రము ఫుల్లమేచకో
త్పలదల వర్ణకర్ణములు - బాటల వర్తుల లోచనంబులుం
గలిగి కఠోరకంఠ ఘన - ఘర్ఘరఘట్టిన ఘోష జన్మమై. 41

ముట్టియ నింద్ర[1]కీలతట - మూలమహీప్రభవంబు లైన పె
న్బుట్టలు గ్రొచ్చివైచుచును - భూరుహషండముఁ జాఁప కట్టుగా
మట్టుచు ఘర్ఘరధ్వనుల - మాటికి మాటికి దిక్పుటంబులన్
ఘట్టన చేయుచు న్వెడఁద - కన్నుల నిప్పులు వెళ్లఁగ్రాయుచున్

పంది వడిఁ బాఱుదెంచెఁ బు
రందరనందను నిశాక - రధ్వజు నడుమన్
దందడి గొరిజల తాఁకునఁ
గందుకములు వోలె శిలలు - గరువాఱంగన్. 43

ఏసెఁబినాక చాపమున - నీశుఁడు గాండివకార్ముకంబునన్
వాసవసూతి యాప్రబల - వజ్రసమానములైన బాణముల్
రాసెఁ బరస్పరంబును వ - రాహము ప్రక్కలు గాడిపాఱమూ
కాసుర సూకరంబు దిరు - గాడె వడిన్మరఘాత వేదనన్. 44

అభవార్జున శరపాత
ప్రభవ వ్యథఁ దిరిగె నవ్వ - రాహము కడు సం

1. నీలతటు

క్షుభితమయి విలయవేళా
నభస్వ దుద్భ్రాంత ఘనఘ - నా ఘనము క్రియన్. 45

దీర్ఘతర హరవరాశుగ
నిర్ఘాత నిపాతజాత - నిబిడవ్యథ నం
తర్ఘూర్ణమాన మగుచును
ఘుర్ఘుర ఘోషంబుతోడఁ - గ్రోడము గూలెన్. 46

అప్పుడు, కిరాతవేషధారి యగుపురారి యోంకార చాపంబు నేల నిలువంబెట్టి, తదీయ శిఖరంబున నడుచెయి మోపి యొరగి యొయ్యారంపు నిలుకడ నిలిచి వలకేల వాలమ్ము ద్రిప్పుచుఁ గట్టెదుర నున్న జగజెట్టి యగు నింద్రుని పట్టిం గనుంగొని, ప్రావృషేణ్యపయోవాహ గర్జాగంభీరంబైన స్వరంబున నింద్రకీలగిరి గహ్వరంబులు ప్రతిధ్వని యొసఁగ, సాటోపంబుగా సగర్వంబుగా సావష్టంభంబుగా నిట్లనియె. 47

ఎవ్వఁడవు రోరి? నీవు! నా - యెదురఁబాఱు
పంది నేసితి బాహాద - ర్పంబు మెఱసి
యెఱుఁగవుర యోరి! నన్ను నీ - యింద్రకీల
పర్వతంబేలు వనచర - సార్వభౌము. 48

ఏనును నా కుటుంబమును - నీ తరళాక్షియు వేఁట వెళ్ళియి
క్కానన భూమిలోఁ బహు మృ - గంబులఁ జంపుచు వచ్చివచ్చి యే
మీ నిశితాస్త్రపాతమున - నిక్కిటిఁ జంపుదు మంచు వ్రాక్ప్రతి
జ్ఞానియమంబున న్వెనుక - జాడఁగఁ గూడఁగ వచ్చుచుండఁగన్.

ఏటలవి నేసి చెంచెత
యోటమివెట్టం గదంగి - యున్నట్టియెడన్
గాటెఱుకువఁ గొఱఁ తిడి యిట
చీటంబున వేడ్కయెల్లఁ - జెఱచితి కదరా! 50

తపసివై యుండి తగురోరి - ధనువుఁబట్టి
శాంతిపరులకు నేలరా - సత్త్వహింస
కపట ధార్మిక యత్యంత - కల్మషాత్మ !
యెవ్వఁడవు రోరి నా పంది - నేయ నీవు. 51

మందెడు బలు నారసమున
గుండియ పగులంగ నేసి - కూల్చితి దీనిన్
వెండి ప్రయోజన మేదీ
రండాసుత ! దీనిపై శ - రము నిగుడింపన్. 52

తబిసివిగాన చావునకుఁ - దప్పితి నీకిది వేఁట పంతమా
యబసరపుం దెఱంగునఁ బ - రాటవికాయత చాపవల్లరీ
నిబిడ శరాహతంబగు వ - నేచరజంతువు నేసి తీఁగతిన్
సబమువయిన్నిగుడ్చినని - శాతశిలీముఖ మెట్టి వెట్టిదో? 53

అనినం గిరీటి యయ్యాటవిక చక్రవర్తి కిట్లనియె. 54

పైవచ్చు క్రూరజంతువుఁ
జే వెరవున నేయుటెందు - [1]సెగ్గే చెపుమా,
యీ వక్ర భాషణంబులు
నీ వాడెదు శబర ! పొమ్ము - నీ చనుత్రోవన్. 55

పంది నపేక్షించెద వో
పందెము గెలువంగవేడ్క—పడియెదవేదో
కందువుగాకా ఫలము పు
ళిందాధిప! యేమిటికిఁ బ—లికెదీ భంగిన్? 56

1. సిగ్గే

[1]దడవౌ దెంచె పుళిందరాజ! చను మ-ధ్యాహ్నంబు డాయంగ న
య్యేడ నీవేళ శివార్చనంబునకు మా - కే కొంత మై యుండఁగా
బడు నీవుం గడు దప్పినాఁడ వటవీ - పం క్తి ప్రచారంబులన్
విడు కోపంబిదె కాంతి గైకొనుము - వాగ్వ్యాద మింతేటికిన్. 57

జోటియు నీవును గుఱ్ఱ‌ర
కోటియు ననుచరులు దప్పి - గొన్నారు మహా
ధాటి పరిశ్రమమున ని
చ్చోట వసించెదరయేని - సుఖ ముండదగున్. 58

అని యర్జునుండు పల్కిన, నాగజ్జులాఁడు మోఱకంబున మొగ
మడ్డంబు గదల్చి యీ [2]వెడమాటలం బనిలేదీ పందియొక ప్రయోజనంబె,
వేఁట పంటంబు దప్పి మమ్ము నధిక్షేపించితి వీ తప్పునకుఁ దపసివిగాన
నిన్ను శిక్షింపను పొమ్మదియునుంగాక. 59

తాటియంత విల్లు - ధరియించినాఁడవు
జ్యాకిణాంకితము భు - జాయుగంబు!
గర్వ రేఖ మిగులఁ - గానంగ నయ్యెడు
డాంభికంబు నీదు - తబిసితనము. 60

ఏమోనాహృదయంబు నిన్నుఁగనియు - ట్లిచ్చాపరాధీనమై
భామాసన్నిధి నుబ్బుచున్నయది నీ - బాహాప్రతాపంబుని
స్సీమంబే నొక కొంత సేపిచటను - జృంభించిరాఁజేయుమా
నామీఁదన్ని గుడింపుమా నిశితనా - నాక్రూరనారాచముల్. 61

చెంచని నన్నుం జూడకు
వంచింపకు హీనజాతి - వాఁడని సంగ్రా

---

1. తడవేలోకి 2. వెుడ్డ

మాంచలమున నిదెనను మె
చ్చించెదవే నపుడు నిన్ను - సేబాసందున్. 62

శివలింగార్చన మెందువోయెడుదప - స్వీత్వమ్ము నెందేనుప
ద్రవముం బొందదులేయొకింత పడిలో - ధ్యానాను సంధానముల్
వ్యవధానం బొకయింతసైఁచవొకొ, బా - హా విక్రమ శ్రీమహో
త్సవముం జూపుదుగాక నా యెదురనా - శ్చర్యంబవార్యంబుగన్.

ప్రదర మరివోయు మేయుము - ప్రాక్ప్రకార
కౌతుకాధీన హృదయుండఁ - గాదెనేను
[1]వీరకుల పత్నియైన యీ - నీరజాక్షి
యానపడుచుండుఁ ఘోర వీ - రాహవములు. 64

అనిపల్కి యా క్రీడాకిరాతుండు గుణధ్వని చేసిన, జలధరధ్వాన గంభీరంబై యేతెంచు నా మ్రోఁతకు సిళ్లుచూపినఁ గోపించుగంధ ద్విపం బుంబోలె రోషించి, యర్జునుండు గాండీవగుణ గర్జాడంబరంబున నంబ రంబు పిక్కటిల్ల నాటక్కరి విలుకానిపై భల్లంబులు నిగుడించె. 65

గాండీవ ప్రవిముక్త నిష్ఠుర మహా - కాండ ప్రకాండంబులన్
ఖండించె న్నృతిబాణ ఘట్టనమునం - గందర్పవిద్వేషి యా
తండాశ్చర్యము నొంది బాపురె పుళిం - దశ్రేష్ఠయంచున్భుజా
దండాహం కృతి వెండియుంబఱపె గా - తక్రూర నారాచముల్.

ప్రారంభం బొకయింత లేకను తృణ - ప్రాయంబున ట్లొందఁగా
గ్రూరాజిం దెగ నేసెనో నటికెనో - క్రొవ్వాడి అంపంబుచే
నీరీతిం దునుమాడవచ్చునే యనన్ - హేలాగతిం ద్రుంచెదు
ర్వారాహంకృతి నీశ్వరుండు విజయా - స్త్రవ్రాతమున్ వ్రేల్మిడిన్.

---

1. ఔరకులపత్ని

శితికంఠుఁడేయు శరములు
ప్రతిహతములు సేయు నరుఁడు - పార్థుని శరముల్
శితికంఠుఁడు నిజశరములఁ
బ్రతిహతములు సేయు బహుళ - బాహుప్రౌఢిన్. 68

క్రూరతర హరనరాశుగ
నారాచ శిలీముఖాది - నానాస్త్రఘటా
నీరంధ్రమైన నభమునఁ
గాడు కొనియె గాఢమంధ - కారము దిశలన్. 69

ఓంకార గాండివ జ్యా
టంకారంబులు నభః క - టాహము నిండెన్
శంకర కపికేతు భుజా
హంకార నిరంకుశాహ - వాంగణభూమిన్. 70

ఇట్లోహరిసాహరి నల్లాడు హరార్జునుల యందు 71

శరధులు యుగాంతవేళా
శరధులునుంబోలెనయ్యె - శరశూన్యంబుల్
సురపతి సూతికిఁబరమే
శ్వరమాయాశక్తినపుడు - సమరాగ్రమునన్. 72

తెలివింబొందక యుండెనెమ్మనమునం - దివ్యాస్త్రమంత్రాక్షరం
బులుశారద్వత కుంభసంభవులసం - బోధంబు సర్వంబుని
ష్ఫలమయ్యెన్ పృథయయ్యె నాంతరకృతా - భ్యాసంబుగాండీవి
కిన్
గలహక్షోణిఁ బినాకిపాణికుహనా - కౌటిల్య శిల్పంబునన్. 73

నిటల విలోచన మాయా
ఘటనమునఁ గిరీటి తన ప్ర - గల్భత చెడినన్
గుటిలముగ బొమలు ముడిచెను
గటకటఁబడఁ దొడఁగె నపుడు - కరము సెమర్చెన్. 74

కాండక్షీణతనాయిషుచ్ఛటలకుం - గల్గెంగదే నాధనుః
పాండిత్యం బెటువోయె నొక్కొ యదిచె - ప్పంజిట్టలౌఁగాక యీ
తండీలాగునఁ బోవువాఁడెమయిమైఁ - దానంచు గర్వోద్ధతిన్
గాండీవంబునఁబూన్చి వేయఁదొడఁగె - గ్గాండీవి గంగాధరున్. 75

మృడు [1]నెన్నడు తలపైఁగ
వ్వడి యడవం దొడఁగె గాండి - వంబున [2]నెడలో
నుడుగక పొడమెడు భయమున
వడఁకుం గుబ్బలి కుమారి - వడవడ వడఁకన్. 76

కలుకు వెంద్రుకలలోఁ - బలుచు మందాకిని
సుకుమార దేహంబు - స్రుక్కఁబాఱె
నవతంస కుసుమ మా - ల్యంబైన శశిరేఖ
బ్రహ్మకపాల రం - ధ్రమునఁ దూఱె
నెట్టియుంబుగ బిగ్గఁ - జుట్టిన పెనుఁబాము
బిగియూడి నొసలిపై - డిగఁగ జాఱె
నలిక నేత్రము [3]కంది - యారజ్యమానమై
ఱెప్పల సందుల - నిప్పులుమిసె

నగజ భయమందఁ బ్రమథులు - బెగడు గుడువ
నుపనిషత్తులు ఘోషింప - నొక్కపెట్టి
కాలకంఠుని మౌళి శృం - గాటకంబు
గాండివంబునఁ దాడింపఁ - బాంటవుండు. 77

---

1. నెన్నడు [illegible]ములగ 2. నపుడే 3. కత్తి

పాండునందన ఘనభుజా - దండకలిత
చండ గాండీవ తాడిత - ఖండపరశు
పృథు జటామండలంబునఁ - బిండుగట్టి
తాండవం బాడె మిన్నేటి - తరఁగపిండు. 78

వింటఁగొని వ్రేయ వ్రేయంగ - విసుగు పుట్టె
జెట్టి బిరుదెంత చూతము - పట్టు మనుచు
సురతనూభవునింబట్టె - శూలపాణి
మల్లసంగ్రామకేళి సం - భావనముల. 79

కపికేతు వృషభకేతను
లుపజాత నియుద్ధకౌతు - కోత్సాహమునన్
నిపుణతఁ బెనఁగఁగఁ దొడఁగిరి
యుపతాయిన్ గతివిశేష - ముపలాస్యముగన్. 80

తోరహత్తంబునందుఁ బా - ర్థుండు గడిమి
సలిపి యూరులు పీడించె - సరభసమున
హరుఁడు సీసాన హత్తించి - యర్జునునకు
బరువు గావించె నిశ్వాస - పవనమునకు. 81

ముక్కంటి కంఠ మూలము
డొక్కరమున నిఱికెఁ బార్థుఁ - డు ప్రబంధుండై
చక్కని ప్రకోష్ఠ పీడన
మిక్కిలికను వెలికి నుఱికి - మినుమినుకు మనన్. 82

తాచుచుఁ బొడుచుచుఁ బడుచును
నేచుచు నుడుకుచును బిట్టు - నెగయుచుఁ గూలం
ద్రోచుచుఁ దూలుచుఁ బెనఁగిరి
ప్రాచీపతి సుతుఁడు హరుఁడు - బాహాబాహిన్. 83

నిష్టంకించి శశాంక శేఖరుఁడు గాం - డీవాయుధుండు న్భుజా
వష్టంభంబులు సిద్ధచారణులు గై - వారంబు గావింపఁగా
దిష్టాంతాంతక ఘోరమూర్తుల యిసా - దృశ్యంబదృశ్యంబుగా
ముష్టాముష్టి రణంబుచేసిరి యన - మ్మోహప్రకారంబులన్. 84

చెమరుచుటఁ యొడుగఱచుట
బొమముడుచుట యే వికార - మును లేని పరి
శ్రమమున సరిసరిఁ బెనఁగిరి
సమవిషమ నియుద్ధకేళి - శంభుఁడు నరుఁడున్. 85

తాటించెఁ బేరణము నా
స్ఫోటించెఁ గిరీటివక్ష - ము వృషాంకుఁడతం
డాటోపమఱక పిడికిటి
పోటున ధూర్జటి యురంబుఁ - బొడిచెం గడిమిన్. 86

అంతం జంద్రకళాధరుండు నిజబా - హాగాఢ పీడా పరి
శ్రాంతుండై యట పాండుసూతి యెదురం - బ్రత్యక్ష మయ్యెం గృపా
వంతుండై యహిరాజ హారములతో - స్వర్వాహినీ వేణితో
దంతిత్వక్పరిధాన పల్లవముతో - దామ్రజ్జటా పంక్తితోన్. 87

చెంచెత యైన పార్వతియుఁ - జెంచులు భూతములున్ని జాకృతి
న్మించిరి, వేలుపుల్నభము - మీఁద లలాటమునందు నంజలు
ల్నించి సమస్కరించిరివి - నీతియు భక్తియు నుల్లసిల్లఁగా
వించెఁ బ్రజామముల్గరము - విస్మయమందుచుఁ బార్థుఁడత్తఱిన్.88

వేదముల్నాల్గు నుపనిష - ద్విద్యఁ గూడి
ప్రణవమంత్రాక్షరములతోఁ - బ్రస్ఫుటముగ
విశ్వకద్రూత్వ మొయ్యొయ్య - వీడుకొనుచు
నభినుతింపంగఁ దొడఁగెఁ - జంద్రార్ధమౌళి. 89

అప్పుడు పార్థుఁడు కృతార్థుఁడై, రోమాంచిత కంచుకితాఖి లాంగుండును, నానందబాష్ప లోచనుండునునై, కేలుదోయి ఫాల భాగంబునం గీలుకొల్పి యిట్లని స్తుతించె. 90

నీవ పరబ్రహ్మంబవు,
నీ వఖిలాజాండ పతివి - నీవు ప్రసన్న
శ్రీ విభవారోగ్యాయుః
ప్రావీణ్య ప్రాభవైక - ఫలదుఁడవు శివా ! 91

నిన్నుఁ ద్రిజగన్నివాసునిఁ
బన్నగకంకణుని భక్త - పరతంత్రుని న
భ్యున్నత కరుణా గుణసం
పన్నునిఁ గనుఁగొంటి మంటి - బాలేందుధరా ! 92

నీ చేతఁ గృపానిధిచే
వాచాగోచర వివేక - వైయాత్యనిచే
నో చంద్రకలాశేఖర !
యాచించి మనోరథార్థ - మర్థింగందున్. 93

నీకై యేను దపంబుచేసితి మహా - నిష్ఠా గరిష్ఠ స్థితి
న్నీకై సంస్తుతి సేయుదుం గడఁగినా - నేర్పొప్పఁగా నెంతయు
న్నీకై పూజయొనర్తుఁ గ్రొత్తవిరుల - న్నిత్యంబు సద్భక్తితో
నీకై సేవ యహర్నిశం బొనరుతు - న్వేదండ చర్మాంబరా ! 94

సాటి యెవ్వరు నీకు [1]ని - శ్శాటజఘన
కైట భారాతిహాటక - గర్భవంద్య !
ఘనజటాజూటవాటికా - ఘటిత వికట
గగన గంగా స్రవంతిక ! కరటి వైరి ! 95

1. నిశాటఘాష.

నీ యందు జగము లుండుం
బాయక యా జగములందుఁ - బాయక నీవుం
దీయనువు దెలియ నజునకుఁ
దోయజ నేత్రునకు నైనఁ - దోపదు శర్వా ! 96

జయ సర్వేశ్వర ! సర్వలోకజనకా ! - చంద్రార్ధ చూడామణీ !
జయ కామాంతక ! కామితార్థఫలదా - చక్షుశ్శ్రవః కుండలా
జయ సంపూర్ణ కృపాగుణైక వసతీ ! - శైలేంద్రజావల్లభా !
జయ దక్షాధ్వర మర్దనా! జయగిరీ - శా ! యీశ! రక్షింపవే. 97

కొండకిరాతుఁడంచుఁ గయి - కోక యసంగత భాషణంబులు
ద్దండత నాడితిన్ గరము - దగ్రత నొంచితి ముష్టిఘట్టనం
గాండివ చాపదండమునఁ - గ్రచ్చఱ మోదితి మౌళి భోగభృ
త్కుండల ! పెక్కుచందముల - ద్రోహము చేసితి నేమి
సేయుదున్. 98

అని మఱియు మఱియు సాష్టాంగ ప్రణామంబు లాచరించి నిలిచిన పాండవ మధ్యముం జూచి ఖండపరశుండు, నీ తపంబునకుఁ బాశుపత వ్రతనిష్ఠాగరిష్టతకు భుజాశౌర్యంబునకు సంతసిల్లితి : వరంబు వేఁడు మనుటయు. 99

అభవ ! యీ నాకు నీప్సితం - బగువరంబు
దయఁ బ్రసాదించి రక్షింపఁ - దలఁచితేని
రౌద్రమై ఘోరమై లోక - రక్షయైన
పాశుపత సంజ్ఞమగు దివ్య - బాణమిమ్ము. 100

అనినం బ్రీత చేతస్కుండై యీశానుండు వరప్రసాదంబు సేసి యంతర్థానంబునందె. 101

# 3. కలభాషిణి

పింగళి సూరన

కళాపూర్ణోదయము — ప్రథమాశ్వాసము

శ్రీలకు నాకర మైవి
ద్యాలతకు నాలవాల మై హరికి సదా
[1]కేళీభవనం బై మహిఁ
జాలన్ ద్వారవతి యొప్పు సౌభాగ్యములన్. 1

తోయధి యంక భాగమున - దోరపుఁ బెంపులతోడఁ దత్పుర
శ్రీయతఁ డూర్మి హస్తముల - చేఁదను నిట్టటు ముట్టిలాలనల్
సేయఁగ నొప్పు నంగగుణ - లీలల నెంతయుఁ బెద్ద యయ్యెనే
ప్రాయము లైనఁ దండ్రియెడఁ - బట్టరు వేఱొక రీతిగా జనుల్. 2

సురుచిరవస్తుసంపదల - సొంపునఁ బెంపు వహింపు చున్నయ
వ్వరపురి యాత్మసామ్యపు వి - వాదము దీర్చుకొనంగఁ బిల్చు ని
ర్జర నగరిన్ సువర్ణమయ - సౌధకర ప్రసరంబు చేత నం
బరము గ్రహించి ఘూరితర - పౌరజనారవ గౌరవంబునన్. 3

అహి మకర ప్రచార సుదు - రాసద మైనిబిడాంధకార స
న్నహనము పొల్పుఁదెల్పుచుఁద - నర్చు సముద్ర మహోద
కంబుచే
బహిరభి వేష్టితం బగుచు - భాసిలుఁ దత్పురికోట మిక్కిలిన్
మహిమనుజక్రవాళగిరి - మాడ్కిని జూడ్కికి వేడ్క సేయుచున్.

---

1. కేళిసదనం

నలుగడలందుఁ గంబము లనం దగి రైవతకాది పర్వతం
బులు పయి కప్పుతాచలుప - పోలికి నింగియు నందు చిత్రభం
గులు పచరించు సౌధమణి - కూటమరీచులు నొప్ప నొప్పు మి
క్కిలిఁ బురలక్ష్మి కొల్వుచవి - కెం గొలువున్న గతిన్ శుభస్థితిన్.

కొలఁదికి నెక్కుడై వరుణు - కోటలు మేడలు గోపురంబులుం
గొలువఁగ వచ్చి యప్పురము - కోటల మేడల గోపురంబులన్
జలనిధి తుంగ భంగచయ - సంగత తత్ప్రతి బింబ సంతతి
చ్ఛలమున నంతయుక్కుధరఁ జాఁగిలి యీ డనువారు చిన్నవోన్.

శైవలనీలముం గమల - శాలియు నైన యగడ్తనీరు ప
ద్మావళి వ్రాఁత తోడికర - కంచుగ నొప్పుచుఁ గోట శాటిలా
గై వఱలంగ హర్మ్యకన - కాంశుని కాయము పేరఁ దత్పుర
శ్రీ విలసిల్లు నభ్రచర - సింధువు మౌళికి మల్లె దండగన్. 7

విలసిత వీచికాయతర - విప్రతిబింబ మిషంబున న్మహా
జలనిధి లక్ష్యపార్శ్వశయ - చక్రిపయిం జెయి సాఁచి యొప్పు సం
ధ్యలఁ బురలక్ష్మి ధర్మవిధు - లన్నియు నొజ్జల పుచ్చ కాయగా
వలయు విడం డతండు రస - వత్పరిఖామిష బాహుబంధమున్. 8

అగణితలీల నప్పురము - నందు విరాజిలుచుంటు నెంతయున్
మృగమద పంకలేపముల - మేలిమి కోటలుఁ బువ్వుఁ దోఁటలు
న్నిగనిగ మన్విటంకముల - నీలపు మేడలుఁ బైఁడి గోడలుం
బగడపు టంచు పొంకముల - పచ్చల తిన్నెలు వింతవన్నెలున్. 9

అలికులము నీలముల - చెలువము వహింప నవ
దళములు హరిన్మణుల - పొలుపునఁ దలిర్పం
దలిరుగమి కెంపులుగఁ - బలుదెఱఁగు క్రొవ్విరుల
విలసనము ముత్తియపు - గుళికలకుఁ దక్కం

గలమణులకుం బసిఁడి - కళుకులకు నీ డగుచు
వెలయఁగఁ బరాగములు - లలితపు వితానం
బులుగ గృహముఖ్యముల - చెలువు ప్రతిబింబములు
బలెఁ బురమునల్దెసలఁ - బొలుచును వనంబుల్. 10

అనుపమిత స్వవాద్యనివ - హంబులతో నర్ప్రమోయుటల్ సహిం
పనియది యైపురం బెదురు - పౌఁజులు దీర్చెనొ మచ్ఛరంబునన్
వనధి కనంగ నయ్యుపవ - నంబులు పొల్పు మిళింద బృందముల్
ఘన మకరాకృతిం దనర - గాడ్పులఁ జింద మరంద బిందువుల్.

కొలఁదికి మించు కెంజిగురు - గుత్తుల మొగ్గలఁ బుష్ప గుచ్ఛకం
బులఁ బువుఁదేనెఁ బుప్పొడులఁ బూపలఁ బిందెలఁ గాయలన్ ఫలం
బుల నెపుడున్ సమగ్రపరి - పూర్తివహింపుచుఁ దద్వనవ్రజం
బెలమిఁ దలిర్చునందనస - మృద్ధికిఁ గోటి గుణాధికంబుగన్. 12

చాతుర్యాధిగతాఖిల శ్రుతిచయుల్ - షడ్దర్శ[1] నీపారగుల్
శ్రౌత స్మార్తవిధి ప్రసిద్ధ పదవీ - సంచార సన్మార్గులుల్
చేతో నామ విలోచనా చలితల - క్ష్మీనాథ సంజ్ఞాది మ
జ్యోతిర్నిత్య నిరీక్షులప్పురములో - నున్నట్టి యుర్వీసురుల్. 13

నానా యుద్ధవిహారహారులు గుణా - నందజ్జయ శ్రీనఖాం
కానూన భ్రమదాయుధవ్రణకిణో దంచచ్ఛరీరుల్ సదా
దాన ప్రౌఢియశో విశేషజితమం - దారుల్ గభీరుల్ మహా
మానాథపులు రాకుమారు లతిషా - మన్నింతు రప్పీఠిరాన్. 14

తమతమ పెద్దవారు మును - దాఁచిన ద్రవ్యములున్న యట్లయుం
డ మితము లేక యెప్పెడుధ - నంబులు తారు గడించి యుర్వి ని

1. లీలాధ్వగుల్.

త్యము నమితంబుగా నవని - ధానము లున్నుచు నప్పురంబులో
నమరెడు కోమటుల్ నగుదు - రల్లకుబేరు నిధీశ్వరత్వమున్. 15

ద్విజులను శాస్త్రనియుక్తిని
భజియింపుచు నిండ్ల సకల - భాగ్యవిభవ మ
క్కజ మైతనర సుఖింతురు
సుజనులు తత్పురములోని - శూద్రులు నెమ్మిన్. 16

ఎప్పట్టున ఘనసారపుఁ
గుప్ప లగు గజాశ్వసుభట - కోటుల చేతం
గప్పురపుఁ గ్రోవి యనఁ దగి
యప్పురము కరంబు వెలయు - నవనీ స్థలిపై. 17

అపుదుగఁ బిడికిట నడఁగెడు నడుముల్
హస్తి సమానపు యానములున్
గురుజఘనములును గుచముల భరముం
గొప్పుల గొప్పతనంబులు మే
గరగరికలు సిరిగల నగుమొగముల్
కల్కి మెఱుంగుఁగ నుంగవలున్
దొరయఁగ వెలపడఁతులు విటధనముల్
దోఁతురు చొప్పడ నప్పురిలోన్. 18

అమరఁగ వింతయిం పొసఁగు - నందు విటాలికి వేశవాటి హ
ర్మ్యములు విమానమాన హర - హారి శిరోగృహ భాగభోగ భా
గమర భుజంగ సంగహృద్య - యంగ మరంగదనంగ సంగత
క్రమ రమణీమణీమణిత - కల్పన నేర్చిన పారువాలచేన్. 19

మాటలు వేయు నేటికి ర - మా విభుఁడందు పదాఱువేలపై
నూటెన మండ్రు భార్యలు ద - నుం బరిపూర్ణ రతోత్సవంబులన్

గాటముగాఁ దనర్చుకుతు - కంబులఁ గొల్వఁ గడున్ సుఖించునే
నాఁట నెఱుంగు నివ్విలస - నంబు లతండల తెల్లదీవిలోన్. 20

అందును వారు వీరనక - యందఱు ధర్మధురీణులైన వా
రందఱు శుద్ధభాగవతు - లందఱు వేద నిరూఢిఁ గన్నవా
రందఱు సాత్త్విక ప్రవరు - లందఱుఁ దత్త్వ మెఱింగినట్టి వా
రందఱు సత్కృపానిరతు - లందఱుఁ బావను లెన్ని చూడఁగన్.

ఇట్టట్టిన నేటికిఁ ద
త్పట్టినమున నున్నయట్టి - ప్రజలే జాతిం
బుట్టిన వారలు వంద్యులు
గట్టిగఁ దద్వినుతి నెల్ల - కలుషము వాయున్. 22

అందొక నటముఖ్యుని ప్రియ
నందన శైశవమునంద - నానాగుణరే
ఖం దనరారుచుఁ గ్రమమున
నందంబుగ యౌవనోద - యముఁ బ్రాపించెన్. 23

కలభాషిణి యనుపేరా
వెలఁది మును వహించు సహజ - విలసత్కల భా
షలకుఁ దగఁజాల దిపుడది
కలికి తనముఁ జతురతయును - గలపలుకులకున్. 24

ఆ సమయమున. 25

బాలిశ కేలిశతాలస
తాలసదచిరావతరణ - తరుణిమ తరుణీ
లోలాలసాలస విలస
నాలోకనములు విటాళి - నట్టిటు చేసెన్. 26

కూఁకటి వేణితోఁ గురులు - కూడకమున్న కుచప్రరోహముల్
పోఁకలతోడి సామ్యమును - బొందక మున్న నితంబ సీమకుఁ
బ్రేఁకఁదనం బొకింత ప్రభ - వింపక మున్న ప్రసూన బాణుఁడ
ట్లాఁకలఁ బెట్టెఁదా నలవ - [1]నావెల బాలికకై విటావళిన్. 27

తనదు మెఱుంగుఁ జెక్కిళులు - దాఁకఁగనీక మొగంబు నాఁపుచున్
జనుబొగడల్ నఖాకలనఁ - జక్కిలిగింతలు వోవ లోఁగుచున్
మనసిజుమించు.భీతియును - నానయుఁ బూనుచు నీ మృగాక్షి యిం
పొనరుచు పెన్నఁడొక్కొ-యని - యువ్విళు లూరుదు ర త్తఱిన్
విటుల్. 28

తొలుఁ బ్రాయపు మగకొదమల
తలఁపుల తగులములు మిగులఁ - దను నెదురుకొనన్
జలజాక్షి జవ్వనము కడు
వెలసెఁ బ్రతిక్షణము వింత - వింతగ నంతన్. 29

మొదల బలురేఖ గలదఁట - యదియుఁగాక
వయసు క్రొత్తఁట వెలయాలి - వంగడ మఁట
వనిత చక్కఁదనంబును - వన్నెలాఁడి
తనముఁ గల్కితనంబును - దరమె పొగడ. 30

మెఱుఁగుటద్దముమించు - మించు బాగుల నింపు
నింపు చక్కని ముద్దు - నెమ్మొగంబు
నవచంద్రికల నవ్వు - నవ్వు తీవులఁ జూపు
చూపుల చొక్కపు - సోయగంబు
నారూఢిఁ బలుమారు - మారువిండ్లకు నేర్పు
నేర్పు కన్బొమదోయి - నెఱతనంబు

1. నామెత.

కటికి చీకటి కప్పు - కప్పుపూనిక కొప్పు
    కొప్పుతోరంపుజ - క్కువ బెడంగు.

గుబ్బ పాలిండ్లు లేఁగొను - గొప్ప పిఱుఁదు
బాహులతికలు మృదుపద - పల్లవములు
బంగరు సలాకపసభంగ - పఱచు మేనుఁ
గలిగి చెలువొందుచుండు నా - చెలువ మిగుల. 31

బెళుకులఁ జిమ్ముచుం గలికి - బిత్తరిచూపు సరత్నకుండలాం
చలకషణోజ్జ్వలత్వము ప - సన్మెఱపం జళిపించుచున్ భుజం
గుల హృదయస్థలుల్వ్రొడిచి - కొంచక తోడన పోటుగంట్లఁ దూ
ఱెలలన యౌర యొక్కొకత - ఱంబువుఁబోండ్లు కటారి కత్తియల్.

కీర్తన పాత్రచిత్రమృదు - గీతకళాకలన ప్రవీణతన్
నర్తన నైపుణీ [1]విలస - నంబుల పెంపున నత్యపూర్వని
ర్వర్తిత పంచబాణసమ - రక్రియలన్ హరిణాక్షి యప్సరః
కీర్తిబలెన్ హరింపఁ దొడఁ - గెన్విట సంచయ చిత్తవిత్తముల్.

ఆరమణీ శిఖామణి మ - హా విభవంబున నొక్క నాఁడు సిం
గారము లెంతయు న్మెఱయఁ - గాఁ జెలికత్తెల తోడఁ జేటికా
వారము తోడవింతచెలు - [2]వంబు నయంబుఁ దలిర్పఁగా వసం
తోరు విలాస భాసురపు - రోపవనంబున కేఁగి యచ్చటన్. 34

క్రొన్నన ల్వలరాచ - మన్ననల్ గనఁగర
    మల్లిక ల్గొనియున్న - మల్లికలును
సంతానముల కళి - సంతానముల యాట
    పాటల ములుచూపు - పాటలములు

---

1. లలసనంబున, 2. వంబసయంబు.

శీవి చేకొన్న పూఁదావిచేఁ బథికాంత
రంగముల్ నొంచునా - రంగములును
మారుమే లై నబం - గారుమేడలఁ బోల్ప
భంగియై మించు సం - పంగిగములు.

మంజులము లై కనంబడు – వంజులములుఁ
గుందములును వాసంతికా – బృందములును
గేసరములును నవనాగ – కేసరములుఁ
గాంతలార కంటిరె కడు – వింత లనుచు. 35

పూఁబోఁడి యొరసికొని చనఁ
గాఁ బయ్యెద యొడసి పట్టెఁ – గనుఁగొంటె చెలీ
లేఁబొన్నను భళిరా యిది
గోఁ బురుషాహ్వాయము నిలుపు – కొను సమయంబుల్. 36

ఆలికుచంబులునాగ
య్యాలి కుచంబులును వాదు – లాడెడు రొద గాఁ
బోలు ననఁ దనరె నూపుర
కోలాహల చకిత కీర – ఘోషము వింటే. 37

లేఁగరువలిచే [1]ముందటి
పూఁగొమ్మలు పాయవడుచు – భుజగతి నెఱపం
గాఁ గురువక మిదె తివిరెడుఁ
గౌఁగిటికి స్నేకుఁదగునె – కై కొనవెచెలీ. 38

పయ్యఁట చెఱంగు శాఖ యను – పాణిఁదెరల్చుచు నోలతాంగి తా
బ్రియమున భృంగకైతవని – రీక్షణము ల్పూచ కుట్మలంబులం

1. ముంగలి.

గయికొన నొప్పు పల్లవశి - ఖామణిమామిడి రిత్తవోవునే
భయ మిఁక నేల యేమిచటఁ - బత్త్రముఁ బుష్పము వేడ్క-
నందితో. 39

అని యీ ప్రకారంబుల మఱియుఁ దానుం జెలికత్తెలు నొండొరులతో ననేకవిధ సరస సల్లాపంబులం బిసాళింపుచు నింపుదళు కొత్తఁ గ్రొత్త విరిగుత్తులచేత నేత్రపర్వం బగుచున్న యా పువ్వుఁదోఁటదఱియం జొచ్చి. 40

అరవీడు కొప్పుల - విరుల వాసనకుఁదో
రపు టూర్పుఁ దావులు - ప్రాపు గాఁగఁ
నడల మందతఁ బెంచు - బడలికలకుఁ బిఱుం
దులవ్రేఁగుఁ జనువ్రేఁగుఁ - దోడు పడగఁ
జెమట చిత్తడిఁ గ్రొత్త - చెలువుగాంచినవళుల్
మొలనూళ్ళ కాంతికి - బలిమి నొసఁగఁ
బయ్యెద లాడింపఁ - బ్రభవించు కంకణ
నాదమందెల మ్రోఁతఁ - బ్రోదిసేయ.

మిగుల రొదగాఁ గికాకిక - నగుచు రతుల
యాయములు సోఁక నెద్దియే - నాడు కొనుచు
సందడింపుచుఁ బుష్పాప - చయము సలిపి
యంతఁ గదఁగిరి డోలావి - హారములకు. 41

అప్పుడాకాశ మార్గంబునం గృష్ణసేవాలాలసుం డగుచు నేఁగుదెంచు నారదమహామునీంద్రుని మణికంధరుం డనుగంధర్వ కుమారుండు గానవిద్యా విశేషాభిలాషంబునం గొలిచి వచ్చుచు నుండి యమ్మగువల ప్రగల్భతాగరిమకు వెఱఁగందుచు శతానంద నందనున కిట్లనియె. 42

తమిఁబూఁదీఁగెలఁ దూఁగు టుయ్యెలలఁ బం- తాలాడుచుందూఁగు నా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యం- ఘ్రుల్ చక్కఁగాఁ
జాఁగి మిం
టిమొగం బై చనుదెంచు తీవి గనుఁగొం - చే దివ్యమౌనీంద్ర నా
కమృగీ నేత్రల మీఁదఁ గయ్యములకుం - గాల్ద్రాఁచులా
గొప్పెడున్. 43

అనుటయు నారదుండు. 44

బళిరా సత్కవి వౌదు నిక్కమ తగ - న్భావించి నీ వన్నయా
యెల ప్రాయంపు మిటారి కత్తెల బెడం - గేనెందునుం గాన వా
రల డోలాచల నోచ్చలచ్చరణముల్ - త్రైవిష్టప స్త్రీలయౌ
దలఁ దన్నం జనునట్లు మించెననినం - దప్పేమి యొప్పెయగున్.

అని పలుకునపుడు నికటం
బున నలకూబరుఁడుఁ దాను - మొగులు మఱుఁగునన్
ఘనమగు దివ్యవిమానం
బునఁ జనుచున్ రంభ విశద - ముగ నది వినియెన్. 46

విని యొకింత కనలి - మన సొకలాగైన
నతని నారదుఁ డని - యాత్మ నెఱిఁగి
భావ వికృతి యెఱుక - పడనీక యడఁచి య
మ్మగువ తనదు ప్రియుని - మొగము చూచి. 47

ఆలించితె యాపలుకుల
పోలిక దెలియంగఁ గలహ - భోజనముని గాఁ
బోలు మన మితనిఁగని యుచి
తాలాపము లాడిచనుట - యభిమత మనియెన్. 48

నారదుఁడుం దదీయవచ - నంబు వినంబడు దిక్కుఁజూచె నె
వ్వారలొ మాటలాడుచును - వచ్చుట తోఁచె నటంచు నచ్చటన్
వారి విమానరత్నమును - వారిధరంబు మఱుంగు వాసె బా
లారుణ భానుబింబ ముద - యాద్రి మఱుంగునఁ బాయు
చాడ్పునన్. 49

ఆ రంభయును గుబేరకు
మారుఁడు నవ్వేళఁ దమ వి - మానోత్తమమున్
నారద మౌనీంద్రు పదాం
భోరుహముల క్రింది చాయఁ - బోనిచ్చి తగన్. 50

పారిజాతకుసుమ - సౌరభంబులు వెద
చల్లు తమ శిరంబు - లల్ల నల్ల
నద్దుచును దదీయ - మగుపాదయుగళి వా
సించి రంతఁ గొంత - సేపు నిలిచి. 51

ఆ వరమౌనియు నొండొరు
పై వదలని ప్రేమ కలిగి - భాసిలుఁ డనుచున్
దీవించె రంభ యపుడా
దైవత మునివర్యుఁ జూచి - దరహాసమునన్. 52

ఓ మునివర మీ దీవన
చే మాపైఁ బ్రేమ కొంత - చెడక నిలుచునో
యేమో కాని యిఁక న్నర
భామల పోఁడుముల కితఁడు - భ్రమయక యున్నె. 53

అని తనమనంబునం గల యీ రసంబు సైరింపంజాలక యెక్క
సక్కెంబుగా నాడు మాటలకు సందియంబు నొందుచు నిదియేమి యనుట
వివరింపుమని మునివరుండు నిలిచి యడుగుటయు దేవరకుం బ్రస్తుత

మననిరోధంబు గాకుండ విమానంబు మీదికి విచ్చేయుఁడు మీ వంటి
ంహానుభావులం గొంతమేర యైనం గొలిచివచ్చుట భాగ్యంబు గాదె
పనుచు శిష్యసమేతంబుగా నతనిం దమ విమానమునందు నునుచుకొని
దలంకారచామరంబులు రెండును విడిచి పుచ్చుకొని తన ప్రియుండును
ాను నిరుగెలంకుల నిలిచి యల్లనల్లన వీచుచు నప్పడంతి మౌనివర్యా
యిప్పుడు మీ రలా డోలికా విహారిణుల ప్రసంగంబున శిష్యుతోడ
కే మని పలికితి రది యానతీయవలయు ననుటయుఁ జిఱునగవుతో
నతండు. 54

బళిరా సత్కవి వౌదు నిక్కము తగ - న్భావించి నీవన్నయ
యెల ప్రాయంపు మిటారి కత్తెల బెడం - గే నెందునుం గాన వా
రల డోలాచల నోచ్చలచ్చరణముల్ - త్రైవిష్టప స్త్రీల యొ
దలఁ దన్నం జనునట్లు మించెననిసం - దప్పేమి యొప్పె యగుఁగా.

అని పలికితి నిం దేమై
నను గాని తెలంగు గలిగి - నం జెపు మాయో
వనజాక్షి యింక దాఁపం
బని యేమి మనంబులోని - భరమని పలికెఁగా. 56

పలికిన నవ్విలాసిని యతనిం జూచి. 57

మీరలు పెద్దలు త్రైలో
క్యారాధ్యుల రేమియన్న - నంటిరిగా కె
వ్వారలు మాన్పెద [1]రిదియే
మారసి యాడితిరో యనుచు - నడిగితి ననఘా. 58

ఊహ యొనర్పరో యతిరా - యోక్తుల వర్ణనలందు నిట్టియ
వ్యాహతి చెల్లు నంచునో యి - టాడితి రింతియ కాక యేవరా

1. రటనే.

రోహలు మమ్ముఁబోలమికి - రూఢిగ నిమ్మెయి నున్న యీ జగ
న్మోహన మూర్తి యర్థపతి - ముద్దుకుమారుఁడె సాక్షి నావుడున్.

అల్లన నవ్వుచున్మని సు - రాంగనఁ జూచి యెటాడు కొన్ననుం
జెల్లుఁ గదమ్మ నీకుఁగడుఁ - జెల్వుఁడు నిబ్బరమైన ప్రేమ రా
జిల్లఁగ నిట్లు వర్తిలుటఁ - జేసి మృగేక్షణ యైన నిట్లు రా
వెల్ల దినంబులున్ సవతి - యేగతిఁ గల్గునొ మీఁదు గంటివే. 60

నినుఁ బోలు వనిత నీకును
వనజముఖీ యితనిఁబోలు - వాఁడితనికి నెం
దును గల్గి కలఁచు నోయి
ట్టినిగాఢపు ముదము సొంపు - తీవులు చనునే. 61

అనుటయు నవ్వుల కనినన్
మునివర మీ మాట యిట్లు - మోఘం బగునో
వినలే నిట్టివి మానుఁడు
నను మన్ననచేసి యనుచు - నాతుక మ్రొక్కెన్. 62

అంత నమ్మహామునీంద్రుని యాజ్ఞానుసారంబునం దద్విమానంబు కలభాషిణి విహరించుచున్న యెలదోఁట లోనికిం దిగియె నట్టియెడ రంభానల కూబరులు వినయ పూర్వకంబుగా నతనిచేత ననిపించుకొని యప్పు డెదుటఁ గాన్పించు వాసుదేవుని ప్రాసాదరాజంబునకుం జెయ్యెత్తి మ్రొక్కి తమ విమానంబుతోడ నిజేచ్ఛం జనిరి. కలభాషిణియు నట మున్ను తన కనతిదూరంబున వినంబడువారల సల్లాపంబు లాలకించియుఁ దదనంతరంబ ధగధగితదిగంతరం బగుచుం జేర నేతెంచు విమానంబు నవలోకించియు నాశ్చర్యంబు నొందుచుండి యప్పుడ ట్లరుగు నలకూబరు నిరూపలావణ్యాది సౌభాగ్యంబులకు మిక్కిలి మెచ్చుచుఁ దదాలోకనం బులందనియక కొంతమేర తద్విమానంబు క్రిందటిచాయఁ బూఁబొదరిండ్ల

యారమి మఱుంగున వారి సల్లాపంబు లాలకింపుచుం జని యంతనది
యెక్కలి దూరంబుగా నేఁగుటయుఁ దిరిగి వచ్చుచుఁ దనమనంబున. 63

ఇంత రూపవంతు - నెంతయుఁ దనకుఁగై
వసము చేసికొని య - వార్య గర్వ
మతిఁ జెలంగు భాగ్య - వతి యీలతాంగి యె
వ్వతె యొకో మనంగ - వలదె యిట్లు. 64

మునుపు నిజేశు సర్థపతి - ముద్దుకుమారుఁ డటంచు నానితం
బిని పలుకంగ వింటిని గు - బేరతనూజునికిం గరంబు మో
హన యగు కాంత రంభయని - యాడు కొనంగ వినంబడు న్మనం
బున నిపుడెన్న నా మెఱుఁగుఁ - బోఁడియ కావలయు
న్నిజంబుగన్. 65

ఇప్పు డిది నిశ్చితంబుగ
నప్పరమ మునీంద్రుఁ జేరి - యడుగఁగవలయుం
దప్పు కతఁ డమర మౌనియ
యప్పటి కప్పటికి వచ్చు - యదుపతి కడకున్. 66

అని చింతించుచు నాయం
గన తా నొక్కతియ యేఁగి - కడుఁ జేరువ నా
యనుపమ తేజుని నారద
ముని గాంఁగ నెఱింగి వినయ - మునఁ బ్రణమిల్లెన్. 67

ప్రణమిల్లి లేచి విరచితాంజలి యై 68

మౌనీంద్ర చంద్ర యిపుడు వి
మానముతో నేఁగినట్టి - మహితాత్ములు రం

భానలకూబరులే యన
నానారదుఁ డట్ల యగుదు - రని యాయకతోన్. 69

నీ వెల్లెఱిఁగితి చెపుమా
నావుడు మీరాడుకొన వి - నంబడు మాటల్
భావింప నట్ల యైనా
భావమునకుఁ దోఁచె ననుచు - భామిని పలికెన్. 70

పలికిన మింట నాడుకొను - పల్కులు వింటివొ యన్న వింటినో
యలఘు తపోనిధాన తన - యత్యధికం బగు రూపసంపదం
జెలువుఁడు కైవసం బనుచుఁ - జెల్లుఁబడిం బచరించి పల్కెనా
కలికి తదుక్తి కోర్వమి ప్ర - కాశిత మయ్యెను మీవచస్స్థితిన్.

అనుటయు మునినాయకుఁడో
వనితా యె ట్లోర్వవచ్చు - వలవని గర్వం
బునఁ గన్ను గాన కాడెడి
యనుచిత వాక్యంబు లేరి - కైనఁదలంపన్. 72

తరుణీ యేరికిఁ జెల్లునె
యరయఁగ నే మింతవార - మనుకొన నిదిగోఁ
బిరువీఁకు గ నున్నది తాఁ
గర మద్భుత మైనసవతి - కయ్యము చేతన్. 73

సవతి యన నింక నొకతెన్
భువిలోపల వేఱ వెదకఁబోవలయునె యో
ధవళాక్షి నీవ కానే
రవె దైవనియుక్తిఁ గొంత - ప్రాప్తిగలిగినన్. 74

నావుడు నంతటిరూప
శ్రీవైభవవతికిఁగాక - సిద్ధించునె యా

దైవనియుక్తియు మాబోం
ట్లవిధమునఁ బాట్లఁబడిన - నిద్ధవివేకా. 75

అనుడు నా మాట కేమి యో - యంబుజాక్షి
రంభ మొదలైన యేయచ్చ - రలకునైన
దక్కవే నీదు రూపసౌం - దర్య మహిమ
లెక్కడే కాక మిగుల నూ - హించి చూడ. 76

అది యటుండనిమ్ము - ముదిత నిన్నును జూచి
నట్లు దోఁచుచున్న - యది యొకింత
నలిన నాభు కొలువు - నకు వత్తువో యన
వత్తు మిమ్ముఁ జూతు - వరమునీంద్ర. 77

అని యింతి పల్కిన - మునిపల్కె నవునవు
నెలఁత ని న్నెఱుఁగుదుఁ - దలఁచు కొంటి
మా శిష్యుఁడైన యీ - మణికంధ రాహ్వయుఁ
డిట గొన్నినాళ్ళ క్రిం - దటను గ్రొత్త
గాఁగ హరిం బొడ - గానంగఁ దావచ్చి
దండక రూపసం - స్తవన రచన
యొనరింప నేకసం - ధన గ్రహించి పఠించి
నట్టి నేర్పరివిగ - దమ్మ నీవు.

పేరఁగలభాషిణివి గద - బిరుదు చదుర
వగుదు బళిబళి యిపుడు నీ - కది ముఖస్థ
మగుచు నున్నదియే శక్య - మగునె చదువ
ననుడు శక్యంబు గాకేమి - యనుచుఁ బలికి. 78

అమ్మదిరాక్షి మధుర గంభీర స్వరంబున నిట్లని చదివె. 79

శ్రీకామినీ కామితాకార సాకార కారుణ్య ధారాన వాంకూర శంకాక రాశోణ రేఖామయూఖాళికి మ్మాలితాలోకనా లోక లోకైక సంస్తుత్య నిత్యప్రభావా విభావైభవాధిక్య ధిక్కారి తానంత మార్తాండ కోటీక యాటీక మానా మలాస్తంభ శుంభద్యశః పూర కర్పూర సౌరభ్య మైత్రీ పవిత్రీ కృతామ్నాయ వాయుప్రచారా నిశాపాదితాపార సంసార సంతాప నిర్వాపణా పాపనిర్వాపనోపాయ నామ ప్రశంసాను భావాభవా భావలోభాకులీభూత చేతస్సుధీ వ్రాత నిర్ణీత సంప్రాప్త సద్భక్తి మార్గైక విశ్రామ భూమీభవత్తత్త్వరూపా సురూపావళీ దుర్నిరూప స్వరూపా గురూ పాసనాసాదితా నారతానన్య సాంకర్య కైంకర్య మాధుర్య ధుర్య ప్రసన్నా ప్రసన్నావళీ మానసోదస్తభోగా పవర్గాభిలాషా హృషీకేశ యీశాన వాణీశముఖ్యు ల్సువిఖ్యాతమైనట్టి నీ దివ్యచారిత్ర చారుప్రచారంబు పారంబుముట్టన్నుతింపంగ లేరంచు నెంచంగ వించుం బ్రపంచ స్వభావంబు భావంబున న్మాన కిట్టేము నీ ముందటం జాటు వాచాటత ల్బాపుచున్నార మిన్నేరము ల్మన్ననంజేసి సైరింపు మోవాసుదేవా! సదానంద! గోవింద! నీ విందు మావింద వైడెంద మానంద మొందింప నెందున్విచారంబు లేమిన్వచో గోచరాగోచరత్వంబు లూహింపలే మైతి మోదేవ! మీపాద సేవాదరంబు న్మదిం గోరుచున్వేద వాదుల్మమాదుల్ కడుం జాల నార్జించి భోగేచ్ఛ వర్జించి నానాతపశ్చర్య లాశ్చర్య తాత్పర్య పర్యాకులత్వంబునం గైకొనన్ మాకు నేయత్నముల్ లేక యోకృష్ణ! యీ కైవడిన్ మీ కృపాలోక సంసిద్ధి సిద్ధించుటల్ బుద్ధిఁ దర్కింప నత్యంత చిత్రంబుగాదే! జగన్నాథ! యీ రీతిఁ జెన్నారము న్నేఋషుల్ మిమ్ముఁ గన్నారఁగన్నారు! మా కన్ను లెన్నంగ నేపుణ్యముల్ చేసెనో యీ విశేషంబుఁ గాంచెన్ విరించోదయ స్థాననాభీ సరోజా! సరోజాత జాతాండముల్ తండతండంబులై యుండ నొండొండ నీ రోమకూపంబు లేపారఁగాఁ దాల్చుటల్ చెప్పఁగా నీవు గోవర్ధనంబెత్తి తంచున్ వరాహావతారంబునన్ ధారుణీ చక్రంబు దాల్చి తంచున్ మహాకూర్మ భావంబునన్ మందర

౼వముల్ మోచి తంచున్ జగంబుల్ సమస్తంబుఁ ద్రైవిక్రమప్రక్రియా
౯ఁ బాదత్రయిం జాలఁ బూరించి తంచున్ నుతింపంగ యుక్తంబె?
క్తప్రజాధీన! దీనిన్ వివేకించి లోకంబులోఁ గొంద ఱార్యోత్తముల్
ర్వవేదంబులున్ సర్వవాదంబులున్ సర్వయాగంబులున్ సర్వయోగం
లున్ సర్వమౌనంబులున్ సర్వదానంబులుం జూడ నీ దాస దాసాను
సాంఘ్రి సంసేవలోఁ గోటి కోట్యంశముంబోలఁగాఁ జాల వంచుం
ాచారముంబూని వర్తింతు రత్యున్నతిన్ సత్యసంకల్ప నిత్యోదయా!
ము నీ నామమాత్రంబు మానాలుకం జేర్చుటల్ దక్క నొక్కింతయున్
క్కత్రోవల్ భవన్మాయ దాఁటంగలే మవ్యయా! భవ్యయోగీంద్ర
ంద్రాదరా కాంక్షితైకాంత సంసేవనా! భావనాతీత కళ్యాణ నానా
ణశ్రీ సముద్భాసితాంగా! మముం గేవలంబైన కారుణ్య దృష్టిం
ాక్షించి రక్షించు లక్ష్మీమనోవల్లభా! దేవదేవా నమస్తే నమస్తే
మస్తే నమః. 80

అని యీ వైఖరి నంతయుం జదివి దై - త్యారాతి యీ దండకం
బునకు న్మెచ్చుచు నిచ్చినట్టిదిగదా - భూరిద్యుతి న్నీదుశి
ష్యుని కంఠంబున నొప్పునావిమలర - త్నోదార హారంబు న
న్మని లోకోత్తమ యంచుఁ బల్కి మఱియుం - బూఁబోఁడి
దానిట్లనున్. 81

పొసఁగ ముత్తెపుసరు - ల్పోహణించిన లీలఁ
దమలోన దొరయుశ - బ్దములు గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్య భేదంబు
లెఱిఁగి నిర్దోషత - నెసఁగఁ జేసి
రసభావములకు న - ర్హంబుగ వైదర్భి
మొదలైన రీతు లి - మ్ముగ నమర్చి

రీతుల కుచితంబు - లై తనరారెడు
　　[1]ప్రాసంబు లింపుగాఁ - బాదుకొల్పి.
అమర నుపమాదులును యమ - కాదులు నగు
నట్టి యర్థ శబ్దాలంక్రి - యలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చున - త్క్రవి వరునకు
వాంచితార్థంబు లొసఁగని - వారు గలరె. 82

చలువ గల వెన్నెలల - చెలువునకు సౌరభము
　　గలిగినను సౌరభముఁ - జలువయుఁ దలిర్పం
బొలు పెసఁగు కప్పురపుఁ - బలుకులకుఁ గోమలత
　　నెలకొనిన సౌరభముఁ - జలువ పసయుం గో
మలతయును గల్గి జగ - ముల మిగులఁ బెంపెసఁగు
　　మలయ పవనంపుఁ గొద - మలకు మధురత్వం
బలవడిన నీడు మఱి - కల దనఁగవచ్చుఁ గడు
　　వెలయఁగల యాసుకవి - పలుకులకు నెంచన్. 83

కావున. 84

ఊరక యటు మిముబోఁటుల
చేరువ జరియింపఁ గనిన - సిద్ధింపవె యే
కోరిక లైన నజస్రముఁ
గోరుదు మీ వీణె మోచు - కొని కొల్చుటకున్. 85

మునివాథ యిటమున్ను - పసజదళాక్షుని
　　యంతఃపురంబున - కరుగువేళ
మణికంధరుని దదం - గణమున నిల్పి మీ
　　వీణియ మీరలే - పాణిఁ బూని

1. ప్రాణంబు.

పోవఁగాఁ జూతు న - ప్పుడు దాని నేఁ బుచ్చు
కొని కొల్చివత్తునో - యని తలంతు
దేవర చిత్తంబు - దెలియమి నట్లు సే
యఁగ నేమి దోఁచునో - యనుచు వెఱతుఁ.

గరుణ నంతమాత్రపుటూడి - గంబు నాకు
ముదల వెట్టుఁ డటంచుఁ గే - ల్మోగిచి మిగుల
వినయ మొప్పఁగ నాయింతి - వేఁడు కొనియె
నతఁడు నట్ల కానిమ్మని - యనుమతించె. 86

అనుమతించుటయు నిమ్మహాత్ముని యనుగ్రహం బీపాటిగలిగె
ం జేసి నావాంఛితంబును సఫలం బగునని సంతసిల్లి రంభానలకూబరుల
నఁ గడపట వినంబడిన వాక్యంబొకటి దలంచుకొని యది తెలియుటకుఁ
తాంజలియై వినయభరంబునఁ గొంకుచు దానను మణికంధరుండు
హస్యశంక నెడ గలుగఁ జనఁగ నమ్మహాముని కిట్లనియె. 87

మహితాత్మ మీర లి - మ్మహినుండ సంకోచ
పడి యేమొ మిక్కిలి - పొడవు చనఁగ
నీక విమానంబు - నిలచేర్పునన కొంత
మేరఁ బోనిచ్చె న - మ్మిథున మిప్పు
డేను వృథా భ్రాంతి - నింతనంతను దాని
వెంబడిఁ జనిపల్కు - వింటి నొకటి
వినుఁడది యర్థేశ తనయు - డోయబల యి
న్నారదు మాటల - నడుమ వేఱ

పొడమె నే మయ్యె నలకళా - పూర్ణసుద్ది
కడమ చెపు మన్న రంభ య - ప్పుడ తెలుపవె
నీకు మఱి చెప్పరాకుంట - యీ కథయును
నీకు నా తోడునుమ్మట్టు - నీకు మనియొ 88

ఏ నెఱుఁగ వేడ్క పడుచున్న - దాన నోత
జో ధనోత్తమ యాకళా - పూర్ణుఁడనఁగ
నెవ్వఁ డాతని సుద్దిఁ ము - న్నెవరిఁ జెప్ప
నెద్ది చెప్పరా దనియె నా - యుగురుఁ బోఁడి. 89

ఇది యానతీయవలయు నవిన నతండు వెఱఁగంది యిది యంతయుఁ గమనపూర్వంబు దీనిఁ దెలిసెదంగాక యని కొంత తడవు నిశ్చలుం డగుచు విశ్వప్రపంచంబునం గల భూతభవిష్యద్వర్తమాన వర్తనంబు లన్నియు విమర్శించి తత్ప్రకారంబుఁ గాంచి కలభాషిణిం జూచి యారంభ ప్రియునకుఁ జెప్పరా దనినకథ యత్యపూర్వంబు నాకున్నుం జెప్పఁ దగదని పలికిన. 90

అనఘ చెప్పరాని కథాంశ - మట్లు యుండ
నీమ్మ నలకూబరునకు న - య్యింతి యేమి
కారణమ్మున నీ ప్రసం - గము వచించెఁ
దెలుపుఁడన దానికిట్లని - తెలిపె మౌని. 91

ఈ రంభయును వీఁడు - నే వేళయును రతి
క్రీడాపరాయణుల్ - కేవలమును
వీరి నొండొరుహాస - వీక్షణోక్తులు దక్క
నట్టి చేష్టితములు - నెట్టివైన
మన్మథోద్దీపన - మహిమఁ జొక్కించు నా
క్కొక ప్రేమచొప్పది - యుర్విఁ గలదు
కావున మము నేఁడు - కనుఁగొనుటకు మున్న
రంభ నవీన మా - ర్తాండుదంచ

శుభ్రఘనరేఖ వత్తిల్లఁ - జూచి నగుచు
బ్రహ్మతోనున్న శారదా - రమణిఁ బోల్చి

ధనద సుతుఁడు నమ్మాటకుఁ - దరుణీ మోలి
చంతశిఖ నొత్తె నత్తఱిఁ - దనరు తమిని. 92

ఒత్తుటయు నెందుఁ గలుగని
క్రొత్త తెలుఁగునఁ జెలంగు - కోపుం గలహా
గ్వ్రాత్తి యపుడొకటి బహువి
చ్ఛిత్తికమై దానికంత - సీమన్ బొడమెన్. 93

ఏయెడ నెన్నఁడుం గనని - యింపులు గుల్కెడు తద్ధిక స్వనం
బాయత మైన కౌతుకము - నప్పుతము న్నొలపింప నేఁడియే
దీ యిది చాలఁ గ్రొత్త బళి - యింకొకమాఱేఁకఁ నొక్కమాఱుటం
చాయలి నీలవేణి నల - కాధిప సూనుఁడు వేఁడె వేఁడినన్. 94

నాచేఁత నింకఁ గా దిది
యోచెలువుఁడ యనఁగఁ గాక - యుస్సన్ విడనే
నోచెలువ యనఁగ వచనా
గోచర సల్లాపరసము - కొంతపు డొడవెన్. 95

అంత నక్కాంత కాంతునికి సంతసంబుగాఁ గొంత కొంత ప్రార్థనంబు సఫలంబుచేసె నతండంత నింతకు మున్నది యెన్నండును యదిగా దిప్పు డెప్పగిది నొడివెఁ జెప్పుమని గ్రుచ్చి గ్రుచ్చి యడుగ నేఁడు నేర్చినది కాదు తడవుం నుండి నే నెఱింగినదియే యెుక్క ణంబున నిది యెఱుక పఱుపక నెఱయ మఱచియు నేఁడు బాలభాను డు మేఘ సంసర్గ విశేష వీక్షణంబునం దలంపైన మానసంబులోనన యుండి యిప్పటి యీ మండగంబువలనఁ గలఁగి వెలివిరియ నిచ్చితినని కిన నతం డెట్లనియె. 96

ఏమికారణమున దాఁచి - తిన్నినాళ్ళ
తరుణి యొజ్జఁగింపు మనుడు నే - తత్ప్రసంగ

మునుఁ గళాపూర్ణు కథలు వ - చ్చునో యనియెడు
తలఁపుచే దాఁచితి నటంచు - వెలఁది పలికె. 97

పలికి యాపౌరుషా - భరణ తత్కథలు వ
    చ్చిన నేమి యంటేని - వినుము తెలియ
నా కథ లీఁకఁ జెప్పి - నట్టివారును విని
    నట్టివారును ధాత్రి - యందుఁ బుత్త్ర
పౌత్త్ర ప్రపౌత్త్రాది - బహుసంతతిని దన
    ర్చుచుఁ జిరకాలంబు - ప్రచుర సంప
దభివృద్ధి శోభిత - శుభసౌఖ్యములు గాంతు
    రనుమాట యున్నది - యాదియంద.

యేను నీ కది చెప్పిన - వాని కొఱకు
నవనిఁ బుట్టంగవలయునో - యని వెఱచెదఁ
బ్రాణవల్లభ యవి తావ - కాంగ సంగ
సౌఖ్యమునఁ జేయ్చునాకు ని - ష్టంబు లగునె. 98

అది నీ కథ వింటివె - ట్లనియెదేని
యేను వినినట్టి పిమ్మట - నిట్టిమాట
పలికె నొక్కయమోఘ వా - గ్విలసనుండు
కావున వచింప విన నీఁకఁ - గాదు నీకు. 99

అని చెప్పెనని చెప్పి నారదుండు. 100

అతివ విను రంభకును గల - యట్టిభయము
నాకుఁ గల్గుటఁ దత్కథ - నీకుఁ జెప్పఁ
గూడ దట్లయ్యు మిక్కిలిఁ - గువలయమున
వెలయఁ గలవది వెలయుత్రో - వలును గలుగు. 101

అది యట్లుండె రంభానలకూబరు లవ్విధంబున సల్లాపంబొన
ి యనంతరంబ తద్విమానంబు మత్స్యమీపంబున క్రేతేర మీాకోలికా
గంబులు పడియెనని కలభాషిణికిం జెప్పె యప్పుడు తద్విస లక్ష్మి
న కౌతుకంబున నెడగాఁ జనియున్న మణికంధరుం బిలిచి యంబు
ు కొలువువేళ దప్పకుండం బోవలయు రమ్మనుచు నచ్చటు గదలి
ుఁ గలభాషిణియు నంతఁదనుఁ జేరవచ్చిన నెచ్చెలులుం దానును
,హంబున కేఁగి వేగంబ కొలువు సింగారంబు సంఘటించుకొని
ుగరి కరిగె. 102

# ౮. సత్యభామా సాంత్వనము

తిమ్మన

పారిజాతాపహరణము — ప్రథమాశ్వాసము.

జనమేజయ నృపవల్లభుఁ
డనుదినమును హరికథా సు - ధాస్వాదమునం
దనివి సనక వైశంపా
యన ముని కిట్లనియెఁ గౌతు - కాయత్తమతిన్. 1

హరివంశ కథ లెల్ల - నానుపూర్విగ నిట్టు
విని కృతార్థుఁడ నైతి - మునివరేణ్య
యాదానవారాతి - యమరులఁ బ్రోవంగఁ
బూని యాయదువంశ - మున జనించి
యతఁడు గ్రమ్మఱ వారి - కాధార మగుపారి
జాతంబు పుడమి కే - రీతిఁ దెచ్చె
ననుమతి నిచ్చిరో - యావేల్పు లొండేని
బలిమిఁ జేకొనియెనో - పాడి దొఱఁగి

తెలియ నానతి యిమ్మ నం - దియము దీఱ
వినఁగ వేడుక యయ్యె న - విస్తరముగ
ననిన నా వ్యాసముని శిష్యుఁ - డతని తోడ
నధిప వినుమని పలికె న - త్యాదరమున. 2

హరి నరకాసురుం గెలిచి - యద్దనుజేంద్రుని యింట నున్నయ
చ్చరల కొలంబువారి నెల - జవ్వనముం బొలివోనివారిఁ ద
న్వరునిఁగఁ గోరువారి లల - నామణులం బదియాఱువేవురం
బరిణయమయ్యె నారదుని - పంపున సౌఖ్యరసైక లోలుఁడై. 3

మఱియు రుక్మిణి, సత్య, జాం - బవతి, మిత్ర
వింద, భద్ర, సుదంత. కా - ళింది, లక్ష్మ
ణ, యనఁగా మున్న కల రజ్జ - నాభునకును
మహిషు లెనమంద్రు సమతాభి - మాన వత్తులు. 4

ఆరమణీలలామముల - నందఱఁ గూడి యదూద్వహుండు శ్రీ
ద్వారవతీ పురోపవన - వాటికలం గృతకాద్రి సీమల
న్వారిధితీరకుంజసద - నంబులఁ గేళితరంగిణీతటీ
కైరవిణీసహాయమణి - కల్పిత సౌధముల న్వసించుచున్. 5

ఏయే వేళల నే సరోజముఖి యే - యేలీలలం గోరుఁ దా
నాయా వేళల నా సరోజముఖి నా - యా లీలలం దేల్చి యే
చాయం జూచినఁ దానయై మెలఁగుచు - న్సౌఖ్యాబ్ధినోలాడు భో
గాయత్తుం డయి పెక్కురూపముల మా - యాకల్పనా చాతురిన్. 6

హరి యిట్లు సతుల నందఱ
సరిగాఁ జూచియును భోజ - జనపాలసుతం
దరుణీమణి సాత్రాజితి
నిరువుర మన్నించి మిగుల - నిచ్చం జనవుల్. 7

కులమును రూపము న్మగని - కూరిమియుం గలదాన నంచు నీ
వల నలరుక్మిణీరమణి - వాసిఁ జెలంగఁగ సత్యభామయుం
గులమును రూపము న్మగని - కూరిమియుం గలదాన నంచు నా
వలఁ బచరింపఁగా రవర - వ ల్వొడమెన్మది వారి కెంతయున్. 8

అంతట నొక్కనాఁడు ధవ - ళాంబుజ నేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంత గృహంబులోన శశి - కాంతశిలామయ వేదిమీఁద నే
కాంతము నందుఁ గొందఱు మృ - గాయతనేత్రలు గొల్వ జూద మ
త్యంతవినోద కేలిమెయి - నాడుచు నుండఁగ నద్భుతంబుగన్. 9

సరిగమపధనిస - సంజ్ఞ స్వరంబుల
మహతి నభోవాయు - నిహతి మొరయ
భాగీరథీపయః - పరిపూర్ణ మణికమం
డలువు హస్తంబునఁ - జెలువు మిగులఁ
బ్రణవ మంత్రావృత్తి - పావన స్ఫటికాక్ష
వలయంబు కర్ణశ - ష్కులిక వ్రేల
సమర నృత్యోచిత - చమరవాలంబును
గక్షపాలయు భుజా - గ్రమున మెఱయ
దేహకాంతు లకాలచం - ద్రికల నీన
జడలు మోక్షద్రు పల్లవ - శంక సేయ
గగనముననుండి వచ్చె నా - కస్మికముగ
నారివేరంపుఁ దపసి దై - త్యారికడకు. 10

వచ్చిన మునిపతి కెదురుగ
వచ్చి, నమస్కృతు లొనర్చి. - వనితయుఁ దానుం
బొచ్చెంబులేని భక్తి వి
యచ్చర రిపు భేది సలిపె - నాతిథ్యంబున్. 11

అపుడు రుక్మిణి కనుసన్న - నబ్జముఖులు
రత్న సింహాసనంబు నా - రదున కిడిరి
హరియు నమ్మౌని యనుమతి - నర్హపీఠ
మున సుఖాసీనుఁ డయి కరం - బులు మొగిడ్చె. 12

సురసంయమి వర ! మీ రిట
కరుదేరఁగ నిప్పుడే కృ - తార్థుఁడ నయితిన్
నిరతంబు మీరు నాపయిఁ
గరుణ గలిగి యునికి యిది య - కారణము [1]సుమీ. 13

1. సూఁడీ.

నావుడు శౌరికి నిట్లను
నా వేలుపుఁ దపసి మర్త్యుఁ - డాడెడి రీతిన్
నీ విట్లు పలుక నుచితమె ?
యే విశ్వజనీన చరిత ! - యెఱుఁగనె నిన్నున్ ? 14

ప్రామినుకుల దొంగఁ - బాతాళ కుహరంబుఁ
జొరఁబాఱి చీఱిన - చోఱ వీవ,
తరిగొండ వెన్నుపైఁ - దాల్చి వేల్పులఁ గూటి
చవిఁ దేల్చినట్టి క - చ్ఛపమ వీవ
నీటిలో మునిఁగిన - నేలచేడియఁ గొమ్ము
కొన నుబ్బ నెత్తిన - ఘోణి వీవ
మునిమాపు బలుగంబ - మునఁబుట్టి బంటు న
క్కఱఁ గాచినట్టి సిం - గంబ వీవ

దితిజు మెట్టిన యా పొట్టి - దిట్ట వీవ
పుడమి ఱేఁడుల నడఁచిన - ప్రోడ వీవ
కడలిఁ గోలకుఁ దెచ్చిన - గబ్బి వీవ
యిపుడు ద్వారక వసియించు - నీవు నీవ. 15

రక్కసి మగువల యీలువు
మొక్కపఱిచె దీవ పాప - ములగమిఁ గాలం
ద్రొక్కెదవు నీవ యింకెట
నిక్కముగా నిన్నుఁ బొగడ - నేర్తునె కృష్ణా ! 16

ద్వారక వైకుంఠ పురం
బీరుక్మిణి లక్ష్మి మీర - లిచ్చట నునికిన్
సారెకుఁ గొల్వఁగ వత్తును
గోరికతోఁ గంసహర ! ము - కుంద ! మురారీ ! 17

అని యిట్లు బహుప్రకారంబులం బ్రశంసించి యవ్విరించి నందనుండ మందానందంబు డెందంబునం గ్రందుకొన నిజవాసనా బిరుద గాథా కథనవంది బృందాయమా నేందిందిరంబును, నుచితోపయోగ జనితా నంద బాష్పసందోహశం కావహ మకరందబిందు తుందిలంబును, నిఖిల మనోరథ ప్రదానకీర్తి శంకాకర విశద ప్రభా నిచుళితంబును, నగు పారిజాతంపుఁ గ్రొన్నన మిన్నేటి పసిండి నెత్తమ్మి చిగురు టాకునం బొదివి యిచ్చిన,

వినయంబు విస్మయంబును
మనమునఁ బెనఁగొనఁగ నపుడు - మాధవుఁ డాక్రో
న్ననఁ గయికొని భీష్మకనం
దనఁ గనుఁగొని సత్యభామ - తలఁపున నిలువన్. 19

ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో - నేమంచు నూహించునో
మది సాత్రాజితి దాని కే నిపుడు ప్రే - మం బంపినన్ దీని నె
ల్లిదముం జేసిన జాడ దోఁచునొకొ యో - లెమ్మిందు నే నున్కిఁ జె
ల్లదువో యేరికిఁ బంపఁగా ననుచు లీ - లన్ రుక్మిణీ కాంతకున్.20

కనుఁగవఁ బిన్న నవ్వు దొలఁ - క న్మునినాథుని కన్ను సన్న ని
చ్చినఁ దగ భోజనందనయుఁ - జేకొని మౌనికి మ్రొక్కి యవ్విరిం
దన నెఱిగొప్పునం జెరివి - న న్వలిగుబ్బలి ముద్దుఁబట్టిలేఁ
త నెల ధరించిన ట్లమరెఁ - దద్దయు మోహన కాంతి సంపదన్.21

మగమీల నగఁ జాలు - తెగఁ గీలుకొను వాలుఁ
గనుఁగవ కొకవింత - కాంతి యొదవె
వలిజక్కవల పెక్కు - వలు దక్కువగ నిక్కు
చనుదోయి కొక వింత - చాయ దోఁచె
నెల తుమ్మెదల దిమ్ము - వెలిఁజిమ్ము చెలువమ్ము
గలవేణి కొక వింత - నలువు మీఱె

ు చెందొవల విందు - చెలువెందు వెదచిందు
మొగమున కొక వింత - జిగి దొలంకెఁ

క్క_దనమున కొక వింత - చక్క_ఁదనము
వ్వనంబున కొక వింత - జవ్వనంబు
్రభమంబున కొక వింత - వి్రభమంబు
లిగె నద్దివ్య కుసుమంబు - కతన సతికి. 22

లకంఠకంఠి యీ గతిఁ
ంలుగడిగిన ముత్తియంపుఁ - బొలు పొందంగా
ల నవ్వొలయఁగఁ బలికెను
లజాసనుపట్టి కలహ - సంభ్రమ పరుఁడై. 23

లజాక్షి ! యిది పారి - జాత ప్రసూనంబు
నరులకు ధరియింప - నదిరి సూవె
ాల్రోమి పార్వతి - పద్మ పద్మజురాణి
యును శిరంబునఁ దాల్తు - రనుదినంబు
హరి బహిః ప్రాణంబ - వగుట నేఁ దెలుఁగంగ
వచ్చె నీ కిపు డిది - యిచ్చెఁ గాన,
ులదుఁలు పదియాఱు - వేవురలో నెవ్వ
నరిలేదు సౌభాగ్య - గరిమ నీకు.

ెవు దాల్చిన కతన నీ - పూవు నేఁడు
ాగ్యము వహించె నుచి తోప - యోగ్య వృత్తి
ీ ప్సితార్థంబు నొడఁ గూర్చు - నిది లతాంగి
ీని మహిమంబు చెప్పెదఁ - దెలియ వినుము. 24

పరిమళము సెడదు, వాడదు
పరువము దప్పదు పరాగ - భర భరితంబై

నిరతము జగదేక మనో
హర మగు నీ కుసుమరాజ - మంబుజ వదనా ! 25

అలినీలాలక ! నీవు నీ పతి రహ - స్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధ సంగరంబునకు ను - ల్లాసంబు గల్పించు ను
జ్జ్వల దీపాంకురమై రతిశ్రమ తనూ - సంజాత ధారాళ ఘ
ర్మ లవంబు ల్దొలఁగింపఁగా సురటియై - రంజిల్లు నిర్భాగతిన్. 26

అడిగిన యంత లోన సర - సాన్నముల న్సమకూర్చు నాఁకట
న్పడలికఁ జెందనీక; యశు - భంబు లడంచు; జగత్త్రయంబునం
బడయఁగరాని సర్వగుణ - భవ్యము సుమ్మిది; దీనిఁ దాల్చి యి
ప్పడఁతులలోఁ గనుంగొను మ - పార మహామహి మానుభావముల్.

కువలయపత్ర నేత్రి ! నెఱి - గొప్పున నీ కుసుమంబు దాల్చుటన్
సవతులు వచ్చి నీ చరణ - సారస యుగ్మము నాశ్రయింపఁగా
ధవుఁ డలలేని కూర్మి జవ - దాఁటక నీ పలు కాదరింపఁగా
నవిరళ భోగభాగ్య మహి - మాన్వితవై విహరింతు గావుతన్. 28

నెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణగుణము - సముచితభంగిన్
గలిగించు నీలతాంతము,
కొలఁదులు చెప్పంగ నిచ్చ - క్రొత్తలు సుమ్మీ. 29

అలరుంబోఁడుల లోపల
నలరుం బోఁడుములు నీకు - నగ్గల మగుచున్
దలపూ వాడక యుండుము
తలపూవు ధరించి వికచ - తామరసాక్షీ ! 30

ఇన్ని దినంబులున్ సవతు - లిందఱిలో నలసత్యభామకన్
నన్నలఁ ద్రిమ్మరున్ హరి వ - శంవదుఁడై యన విందుఁ గాని యా

...నయ! నీ యెడం గలుగు - గౌరవ మెయ్యెడఁ జూచి కాన లే
...న్న ననర్ఘ్య దివ్య కుసు - మోత్తమ మేరికినైన నిచ్చెనే? 31

...నిదాన నంచు నెల - జవ్వని నంచు జగంబులోనఁ బే
...నదాన నంచు బతి - యెంతయు నా కనురక్తుఁడంచుఁ దా
...చు విఱ్ఱవీఁగుచు గ - ణింపదు కాంతల సత్య యింతకున్
...క యున్నె నీ మహిమ - సూచిన బోఁటులు విన్నవించినన్.

...యించిన మొద లోక వ
...ర మాత్రము తావకీన - ధమ్మిల్లములో
...వుకొని మగుడ నివ్విరి
...ణీ! యలపారిజాత - తరువున కరుగున్. 33

...నుచుఁ నారదుఁ డాడిన - యట్టి పలుకు
...టి వృత్తాంత మంతయు - నరసి పోయి
...ు వేళన సఖులు దే - వేరులకును
...న్నవించిన వారును - జిన్నవోయి. 34

...ందఱిలోనఁ బెద్ద మహి - మాన్వితః రుక్మిణి గానఁ బూవు గో
...ందుఁడు దాని కిచ్చెఁ దగ - వే యని లక్షణ యోర్చె పైఁచెఁ గా
...ది శమించె భద్ర యవు - లెమ్మని యూరడిలెన్ సుదంత లోఁ
...ందుట మానె జాంబవతి - కోప మడంచెను మిత్రవిందయున్. 35

...రిలోపల సౌందర్య - వతియు మాన...
...తియు మహనీయ సౌభాగ్య - వతియు నైన...
...త్య యంతట నేమొకో - శౌరికడకుఁ
...ోయి రాఁ దయ్యెఁ జెలి ప్రొద్దు - వోయె ననుచు. 36

తన శృంగార వనంబులో నగరిప్రాం - తం జక్కఁగా దిద్ది తీ
ర్చిన పూఁదేనియ ఘ్నేటికాలువ దరిం - జెంగల్వ పుష్పావళు నిం
చిన చంద్రోపల వేదిపై సరస గో - ష్ఠిన్ బోటియుం దాను న
వ్వనజా తాయత నేత్ర శౌరిగుణముల్ - వాక్రుచ్చి వర్ణించుచుణ.

అలికుల రావముల్ గిసల - యాకుల కోకిల కాకు కాకలీ
కలకల నాదముల్ సెలఁగ - గమ్మని తమ్మి కొలంకు తెమ్మెరల్
వొలయఁగఁ దొంటి చందమున - బుద్ధికి నేమియు నింపుగామికిం
గలఁగుచు సత్యభామ చెలిఁ - గన్గొని యించుక సంశయించుచున్.

అకట! యదేమియో యెఱుఁగ - నయ్యెదఁ దొయ్యలి దక్షిణాంస చూ
చుక నయన ప్రకంప గుణ - సూచన లేమియు వల్లగావు; సా
రెకు మది జాలి వొంది యొక - రీతిఁ దలంకెడుఁ బ్రాణనాథుఁ డొం
డొక చపలాక్షిఁ గూడి నను - నొల్లని చెయ్దము లేమిసేసెనో. 39

అని సత్యభామ తన విధ
మనుఁగుం దొయ్యలికిఁ జెప్పు - నవసరమునఁ జ
య్యన వచ్చి యొక్క నెచ్చెలి
కనుఁగవ నెఱసంజ వొడమఁ - గా నిట్లనియెన్. 40

అమ్మా! యేమని చెప్పుదు
నెమ్మి న్నీ విభుఁడు రుక్మి - ణీసతి మణిసౌ
ధమ్మున నుండఁగ సురముని
గ్రమ్మఱ నాకస్మికమ్ము - గా నచ్చటికిన్. 41

చనుదెంచి యమ్మురారికి
ననఘ మ్మమరైక - యోగ్య - మతిసౌఖ్యకర
మ్మనితర సులభ మ్మిది యని
కొని యాడుచు నొక్క దివ్య - కుసుమ మ్మొసఁగెన్. 42

మిన్నందివేగ గయికొని
కన్నుల నొత్తికొని మ్రొక్కి - గారవ మెసఁగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను
అన్నెలఁతయు గొప్పులోన - నవ్విరిఁ దాల్చెన్. 43

అంతలోనన యద్భుతం - బావహిల్ల
గొలఁది యిడరాని యొక వింత - చెలువు గలిగి
రాజ బింబాస్య రుక్మిణి - తేజరిల్లె
సానఁ బట్టిన మకరాంకు - శస్త్ర మనఁగ. 44

ఆకుసుమంబు దాల్చిన మ - హా మహిమంబునఁ దోడి కామినీ
లోకము మచ్చరంబు మది - లోనఁ దొఱంగి భజించు చుండ న
స్తోక నిజప్రభావములు - సూపెడు గద్దియమీఁద నెక్కి ము
ల్లోకము దాన యేలుగతి - లోలవిలోచన యేమి సెప్పుదున్. 45

ఎంతకు లేఁడు నారదము - నీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁ - గాఁ బలికెం బతిఁ గూర్చుదాన నా
యంతటివారు లేరని య - హంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
వంతకు వచ్చు సత్య గరు - వం బికఁ జెల్లదటంచు మానినీ, 46

ఆరణభోజను మతకము
లారుక్మిణి నటన, లాము - రాంతకు చెయ్వుల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు - వారిజనేత్రీ! 47

అనవిని వ్రేటువడ్డ యురగాంగనయుంబలె నేయి వోయ భ
గ్గన దరికొన్న భీషణ హుతాశన కీల యనంగ లేచి హె
చ్చిన కనుదోయి కెంపు దన - చెక్కులఁ గుంకుమ పత్రభంగ సం
జనిత నవీన కాంతి వెద - చల్లఁగ గద్గద ఖిన్న కంఠియై. 48

ఏమేమి, కలహాశనుం డచటికై - యేతెంచి యిట్లాడెనా?
యామాట ల్చెవియొగ్గి తా వినియెనా - యా గోపికావల్లభుం?
డేమే మాడెను రుక్మిణీ సతియు, నీ - వింకేటికిన్ దాఁచెదే?
నీ మోమాటలు మాని నీరజముఖీ - నిక్కం బెఱింగింపవే. 49

అతుల మహానుభావ మని - యవ్విరిఁ దానొక పెద్దసేసి య
చ్యుతునకు నిచ్చకం బొదవ - నూడిద యిచ్చిన నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబు గల్గునెడ - నర్పణ సేసినఁ జేసెఁగాక, యా
మతకరి వేలుపుం దపసి - మమ్ము దలంపఁగ నేల యచ్చటన్? 50

పలుదెఱఁగు ముళ్ల మాటలు
కలహమె కల్యాణ మని జ - గంబులవెంటన్
మెలఁగెడు మౌనికి సహజము
పలదని వారింపవలదె - వల్లభుఁ డతనిన్? 51

ముని యేమి సేయు? రుక్మిణి
కౌనఁ గారణ మేమి? ధూర్త - గోపాలుఁడు సే
సిన చెయిద మేమి చెప్పుదు?
మన మెరియదె ప్రాణమైన - మగఁ డిట్లయినన్? 52

పరికింపరు తమ జాడలు
తరుణుల తగులములు నమ్మఁ - దగ దంద్రు మదిన్?
శర దంబుద చలచిత్తులు
పురుషులె పో; వారి నమ్మ - బోలునె చెలియా! 53

ఇన్ని దినంబులున్ సవతు - లందఱలోఁ గడు గారవంబునం
గన్నియ, నన్ను వల్లభుఁడు-గన్నులఁ గప్పుకొనంగ నుండి, యా
వన్నెయు వాసియుం దఱిఁగి - వారు నను తల లెత్తి చూడఁగా
నన్నలఁ జాయలం బలుక - నైతునె! ప్రాణము లెంత తీపొకో!

మొగమోటుకై వలసి - నాటకముల్ ఘటియించి, రుక్మిణీ
మిని మీఁదటం గలుగు - గౌరవముం గృపయుం బ్రియంబుఁ దా
మియుఁ గాన నీక, యిట - నిన్ని దినంబులు నన్నుఁ దేల్చెనో
మరసాక్షి ? మెచ్చవల దా మురదానవ భేది కృత్యముల్ ? 55

చెలి, శౌరి కిచ్చెనఁట - యొక్క లతాంతము దెచ్చి నారదుం
చపలాక్షి కిచ్చెనఁట - యాతఁడు నవ్వి, యిట్టిమాటలా
! చెవులన్వినంబడియుఁ - బ్రాణము దాల్చెద మేన; నింతగా
ఁచితి, నింక నెట్టివి క - నుంగొన నెమ్మెయి నున్నదాననో !

గానుకొని మేలుగీళ్ళకు
గోనయి విహరించువారి - లోక మెఱుఁగదో
యూ నరకాసుర దమనుఁడు
నా నెఱుఁగఁడొ భోజకన్య - తా నెఱుఁగదొకో. 57

ఆ సరసీరుహాక్షి నిల - యంబునఁ బంకజనాభుఁ డుండుటం
కేసి యొసంగెబో తగవు - సేకొని యొక్క లతాంత, మింతలో
నాసియు వన్నెయుం దగవు - వైభవముం జలము న్వివేకమున్
బో నవతు ల్భజించుటకుఁ - బో వెఱఁగయ్యెడు, నేమి సెప్పుదున్.

కలకాల మొక్కగతిఁ బా
పలలో దారంబు మాడ్కి - సతిమదిలోనన్
మెలఁగెడు పురుషుఁడు గలుగుట
తొలిజన్మము నోముఫలము - తోయజనేత్రా ! 59

కలలోన నైన న - వ్వుల కైన నామాట
జవదాఁట వెఱచునో - చంద్రవదన !
యేపదార్థంబు నా - యెదుటఁ బెట్టక మున్న
యెవ్వారి కొసఁగఁడో - యిగురుఁబోఁడి !

చెలులు నాతో నేమి - చెప్పుదురో యని
లంచ మిచ్చు నో - చంచలాక్షి !
తోడిచేడియలు నా - తోడి వంతులకు రా
నయిరింపఁ జాలఁ డో - సన్నుతాంగి !

యరమరలు లేనికూరిమి - ననఁగి పెనఁగి
కొదలు దీఱని కోర్కులఁ - గూడి మాడి
కపట మెఱుఁగని మమతలఁ - గలసి మెలసి
యున్న విభుఁడిట్లు సేయునే - యోలతాంగి. 60

కృత కాద్రి కందరా - కేళీ నిగూహన
వేళా పరస్పరా - న్వేషణములు,
పోషిత మాధవీ - పున్నాగ పరిణయో
త్సవ కల్పి తానేక - సంభ్రమములు,
చాతురీ నిర్జిత - ద్యూత పణాదాన
కలిత చేలాంచ లా - కర్షణములు,
సాయం సమారంభ - చక్రవాక ద్వంద్వ
విరహావలోకన - విభ్రమములు.

సాంద్రతరచంద్రికా కేళి - చంక్రమములు
విధు శిలామయ వేదికా - విశ్రమములు
ఫలక చిత్రిత నిజరూప - భావనములు
మఱచెనో కాక రుక్మిణీ - మాయఁ దగిలి. 61

పతి ప్రాణసదృశ బంధువు
పతి దైవం బేదుగడయ్యా - బతి సతులకు న
ప్పతియె కడు మేరదప్పిన
గతి కులకాంతలకు వేఱు - గలదే చెపుమా. 62

పుచ్చుకొన్నను
ోర్వంగ వచ్చు - మగ( డింతులకున్
పుచ్చుకొన్నను
నె యింక నేటి - మాటలు చెలియా ! 63

మిగుల( బొగులుచు
మున( గోప - సదనంబునకున్
ంతాంగి హరిచం
మునకు నాగ - తరుణియు( బోలెన్. 64

గట్టుకొని - మౌనముతోడ నిర స్తభూషయై
గట్టి నిడు - వాలిక కస్తురిపట్టు వెట్టి లో
టింటి కద - కంకటిపై జలదాంత చంద్ర రే
ంగియై పొరలె - గాఢమనోజ విషాద వేదనన్. 65

తలోచనకు( - బెల్లగుమోహము సంఘటిల్లె వె
ం నెవ్వగల్వోడమె(-గంపము పుట్టె( జెమర్చె మేను మా
ిన్న( జాటొదవె - నాటె( గడుం బరితాపవేదనల్
ాము కాటు గతి - మచ్చరమ న్విన మగ్గలించ(పగన్.

న్నమూయు( గను - విచ్చు నగుం దలయూ(చు(
బాన్పుపై(
ంచు లేచు( దడ( - బాటును దత్తఱముం జలంబు లో
గోపవేగమున - నగ్గల మైన మనోజు బాధలం
ాస్తి హస్తగత - పద్మినియుం బలె సొంపు పెంపఱన్.

సాత్రాజితి
ముమున వగల( - గుందుచు ఘన సం

తాపంబు పేర్మి నితర
వ్యాపారము మాని యుండె - హరియును నచటన్. 68

ముని నాకిచ్చిన పూవు చందమును నే - మున్నాడి యీ భోజనం
దన కర్పించిన జాడయుం దెలియఁ జెం - తం బొంచి వీక్షించి పో
యిన సాత్రాజితి బోటి నావలనఁ దా - నేమేమి కల్పించెనో
యని ప్రద్యుమ్నుని మౌనిదండ నిడి చిం - తాయత్త చిత్తంబునన్.

అరదము నెక్కి కేతన ప - టాంచల చంచలమైన తాల్మితోఁ
దురగ జవంబు మున్గడవఁ - ద్రోచి కడంగెడు తత్తరంబుతోఁ
దిరిగెడు బండికండ్ల పగి - దిన్ భ్రమియించు మనంబుతోడ నా
హరి సనుదెంచె సత్య నము - దంచిత కాంచన సౌధవీధికిన్. 70

వచ్చి యరదంబు డిగ్గి త - ద్ద్వార సీమ
దారుకుని నుండ నియమించి - తాన యొకఁడు
కమలనాభుండు కక్ష్యాంత - రములు గడచి
యలబలము లేని నగరెల్ల - నరసి చూచి. 71

కనక పంజర శారి - కలకుఁ జక్కెర వెట్టి
చదివింప రేలొక్కో - సకియలిపుడు ?
కరతాళ గతుల మం - దిర మయూరంబుల
నాడింప రేలొక్కో - యతివ లిపుడు ?
క్రొవ్వాడి గోళ్ళఁ దం - త్రులు మీటి వీణియ
ల్వాలికింప రేలొక్కో - భామ లిపుడు ?
కలికి రాయంచ బో - దల నెల్ల నెలయించి
నడిపింప రేలొక్కో - పడఁతు లిపుడు ?

ఇన్ని దినముల వలె నుండ - దేమి నేఁడు
చిన్నబోయిన దీపేడ - చెన్ను దఱిఁగి

పద్మముఖితోడ నెవ్వరేఁ - బారిజాత
పుష్ప వృత్తాంత మెఱిఁగింపఁ - బోలు నొక్కొ. ౭౨

అని యనుమానించుచు నా
య్యెనఁ గోపగృహంబు సేరి - యాసత్రాజి
త్తనయ ముసుంగిడి యుండఁగ
ననువు మెఱయఁ జొచ్చి మాయ - యచ్చు పడంగన్. ౭౩

కొండల మంతినంబులను - గొందఱ జంకెన వాఁడి చూపులం
గొందఱఁ జేతిసన్నలఁ ద - గుల్పడఁ జేయుచుఁ జేరఁ బోయి మ
ధ్యందిన భానుమండల క - రావళి హోవళి వాడియున్న తీఁ
గం దలఁపించు నమ్మగువఁ - గన్గొని యెంతయు విస్మితాత్ముఁడై -

ఈలలితాంగి చంద మొక - యించుక చూచెద నంచు ధూర్తగో
పాలుఁడు తాలవృంత మొక - భామిని సత్యపెఱుందనుండి మం
దానిల లీలమై విసర - నాదటఁ గైకొని వీచెఁ దద్వపుః
కీలిత పంచసాయక శి - ఖిం దరికొల్పుచు నున్న కైవడిన్. 75

అంతటఁ బారిజాత కుసు - మాగత నూతన దివ్య వాసనల్
వింతలు సేయఁ దావి యిది - విస్మయ మంచు ముసుంగు ద్రోచియే
కాంత గృహంబు నల్గడలు - [1]నారసి సంభృత తాల వృంతునిం
గాంతునిఁ జూచి బాష్పకణి - కాంతరళీకృత లోచనాంతయై. 76

తల వాంచి మగుడ ముసుఁగిడెఁ
గొలుకుల దిగజారి జాలు - కొను బాష్పంబుల్
పలుచని చెక్కుల లవలీ
దళ పతిత మరంద బిందు - తతిఁ బురుడింపన్. 77

1. గన్గొ...

ఓర్వక యింత లేని వికచోత్పలలోచన చిత్త వీథిఁ జ
ల్లార్పగ నీలనీరద శుభాంగుఁడు వే చనుదెంచె నంచుఁ గం
దర్ప హుతాశను న్వెలికిఁ దార్చు సఖుండును బోలె వేఁడి ని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమి తావరజాంశు కాంతమై. 78

వనిత కుచద్వయంబుపయి వ్రాసిన కుంకుమ పత్రభంగముల్
జనిత నితాంత ఘర్మకణజాలముచేతఁ గరంగి మెల్ల మె
ల్లన వెలిపట్టు పయ్యెద కెలంకుల జాఱుట యొప్పె మానసం
బున నెలకొన్న క్రోధరసము న్వడిఁ గట్టుచు నున్న కైవడిన్.

మానవతి యిట్లు మానని
మాన క్రోధములచేఁ గుమారిలి చింతా
ధీనగతి నుండ మదిలో
నూనిన ప్రేమమున నంబుజోదరుఁ డనియెన్. 80

ఇందునిభాస్య! మైతొడవు లేల ధరింపవు? సన్న కావు లీ
వెందును మాన లేవు, తెలుపేటికిఁ గట్టితి? వీటికారుచుల్
కెందలిరాకుమోవిఁ దులకింపఁగఁ జేయక యున్కి యేమి? నీ
చందము వింతయయ్యెడు; నిజంబుగ నాకెఱుఁగంగఁ జెప్పుమా.

మన మరయం దలంచి యొకమార్గము వన్నితొ? నవ్వుటాలకో?
నను వెఱపించెదో? యకట నాయెడ [1]నిక్కము దప్పు గల్గెనో?
వనజదళాయతాక్షి! పగవాఁడనె? నన్నిటు లేల చూడ? వొ
క్క నిమిషమైన నీవు దయఁ గన్గొన కుండిన నిల్వ నేర్తునే?

పలుకులఁ దేనె లుట్టిపడఁ బల్కవు నేఁడిది [2]యేల? వాలుఁగ
న్నుల నునుసిగ్గు నూల్కొనఁ గనుంగొన వేల? యురః
స్థలంబుఁ జ

1. నిక్కపుఁ దప్పు 2. యేమి క్రాలుఁ గన్నుల.

న్నల నెదురొత్తి మక్కువ న - నుం బిగికౌఁగిటఁ జేర్పవేఁటికే?
చిలుకలకొల్కి, యెవ్వ రెద - సేసిరి? నీకిటు లేల చింతిలన్.83

మనమున మాటలం బ్రియల - మన్నన నీ నొకనాఁడు నెట్టికా
మినులకు గారవంబు మెఱ - మెచ్చులకై పచరింతుఁ గాని పా
యని యనురక్తి నీయెడన - యగ్గలమై కనుపట్టు నాకు నీ
పనిచినపంపు సేయుటయ - ప్రాభవ మౌటిది నీ వెఱుంగవే ? 84

పడఁతి ! నీమధురాధరామృతము నీ - బాహా పరీరంభముం
బడయన్ ధన్యుఁడఁ గాకయుండిన నను - బాటించి యొక్కింత నీ
నిడు వాలుం గడగంట జూడు మనుచు - న్నిల్పోపమింబై చెఱం
గొడియం జేవిరిదమ్మి బ్రేయుటకునై - యుంకించి జంకించినన్.

పాటలగంధి చిత్తమునఁ - బాటిలు కోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటు గామి మృదు - పల్లవ కోమల తత్పద ద్వయీ
పాటల కాంతి మౌళి మణి - పంక్తికి వన్నియ వెట్టి నాజగ
న్నాటక సూత్రధారి యదు - నందనుఁ డర్మిలిఁ బ్రొక్కెఁ:
బ్రొక్కినన్. 86

జలజాతాసన వాస వాది సుర పూ - జా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిర ము - చ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోచె లతాంగి; యట్ల యగు; నా - థు ల్నేరము
ల్సేయఁ జే
తలుకం జెందినయట్టి కాంత లుచిత - వ్యాపారము ల్నేర్తురే? 87

కోపన పదహతిఁ గుషా
గోపాలుఁడు గాంచి మెఱు గ - గుర్పొదువఁగ ను
ద్దీపిత మన్మథరాజ్య
ప్రాపితుఁడై పలికెఁ గూర్మి - బయలు పడంగన్. 88

నను భవదీయదాసుని మ - నంబున నెయ్యవుఁ గిన్కఁ బూని తాఁ
చిన యది నాకు మన్ననయ - చెల్వగు నీపదపల్లవంబు మ
త్తను పులకాగ్ర కంటక వి - తానము దాఁకిన నొచ్చు నంచు నే
నని యెద; నల్క మానవుగ - దా యిఁకనైన వరాళకుంతలా! 89

అన విని మానినీ తిలక - మప్పుడు మేయఱ దోఁప నిక్కి, వీ
డిన కచపంక్తిఁ బల్మఱు ము - డి న్వెడ దోపుచుఁ, బైఁ జెఱంగు గ్ర
క్కున జనుదోయిఁ జేర్చుచు, మొ - గంబున లేఁజెమ రంకురింప జం
కెన నెఱిచూపు చూచి పలి - కెం జలితాధర పల్లవాగ్రయై. 90

ఈ నయగారపుం బ్రియము, - లీపస, లీమొగమిచ్చమాటలే
లా? నిను నమ్మియుండిన ఫ - లం బిదె తోడన కల్గె నాకు, నీ
యాన సుమీ ననుం జెనకి - యాఱడి వెట్టిన, నవ్వువారలం
గాన; వెఱుంగునే పసుల - కాపరి భావజ మర్మ కర్మముల్? 91

ఇం కిటు నిన్ను నమ్మ, నను - నేమిటికిం గెరలించె, దెంతయుం
బొంకము గాని నీవలని - బొంకులు మాచవి గావు రుక్మిణీ
పంకజవక్త్ర నేత్రకును - బ్రాణపదంబులు గాని; వల్లవీ
కింకర ! చాలుఁ జాలు నుడి - కింపకు నింపకు లేని కూరుముల్. 92

గట్టివ చేఁతలుం బనులుఁ - గల్ల దనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన వెందు లేని పలు - పోకల మాయలు నీకు వెన్నతోఁ
బెట్టిన వౌ నెఱింగియును - బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మిగులఁ - గోల్పడి పోయితి నేమి సేయుదున్.

మునిపతి వచ్చి పూ వొసఁగి - మోదముతోడ భవత్ప్రియాంగన
న్వినుతి యొనర్పఁగా వినిన - వీనుల మా చవిగాని మాటల
న్వినవల సెంగడా? యిపుడు - నీ విట వచ్చుట పారిజాతవా
ననఁ బ్రకటించి నాకు వెకసెక్కెము సేయన కాదె? చెప్పుమా.

మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు - మాన మఖిల స
మ్మానములకు మూలం బగు
మానరహిత మయిన బ్రతుకు - మానిని కేలా? 95

తనదు కోడండ్రలోనఁ బె - ద్దయుఁగ నన్ను
దేవకీ దేవి మన్నించు - నీవు నాకుఁ
జనవు లిచ్చుటఁ జేసి; యా - సాధ్వి సేవ
సేయఁ బోవంగ నాకింక - సిగ్గు గాదె?

ఉవిద యెవ్వతె నోఁచి - యున్నదో యీన్యమం
తకరత్న మింక నౌఁ - దల ధరింప
నీరైవతక శైల - చారు కూట విటంక
కేలి కిం కెవ్వతె - పాలుపడునొ
యెవ్వతె కబ్బునో - యీ వసం తారామ
కర్పూర కదళి కా - గార వసతి
లీల నీ మణి సౌధ - జాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధి - జూడఁ గలదొ

యకట నేఁ బెంపఁ బెరిఁగిన - శుక మయూర
శారికాబృంద మెవ్వతెఁ - జేరునొక్కొ
నన్ను నాతోడి సవతులు - నగక మున్న
వంత మలరంగ నిన్ను మె - ప్పింతుఁ గాక. 97

నను నెవ్వతిఁ గాఁ జూచితి?
వని యంత ర్బాష్ప యగుచు - నవనత ముఖి యై
ఘనతర గద్గదికా ని
స్వనమున మఱి మాటలాడ - శక్యము గామిన్. 98

ఈసునఁ బుట్టి డెందమున - హెచ్చిన శోక దవానలంబుచే
గాసిలి యేడ్వఁ బ్రాణవిభు - కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ - జేలచెఱం గిడి బాల పల్లవ
గ్రాస కషాయకంఠ కల - కంఠ వధూ కల కాకలీధ్వనిన్- 99

ఆ రమణీ లలామ మది - నంటిన కోప భరంబు నిల్వఁగా
నేరక నెవ్వగం బొగుల - నీరజనాభుఁడు నిండుఁ గౌఁగిటం
జేరిచి బుజ్జగించి నునుఁ - జెక్కులఁ జాలుకొనంగ జాఱుక
న్నీరు కరంబునం దుడిచి - నెయ్యముఁ దియ్యముఁ దోఁప నిట్లనున్.

ఓ లలితేంద్రనీల శక - లోపమ కైశిక ! యింత వంత నీ
కేల లతాంతమాత్రమున - కేఁ గలుగ? న్నేను, నీకు దేవతా
కేలివనంబు సొచ్చి యని - కి న్బలసూదనుఁ డెత్తి వచ్చినన్
దీలు పడంగఁ దోలి యిటఁ - దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్.

వామలోచన ! నీ కేలి - వనములోనఁ
జలువ వెదచల్లు చెంగల్వ - కొలని కెలన
సరస కర్పూర కదళికా - తరుల నడుమఁ
బెరటి చెట్టుగ నాటింతుఁ - బెంపు గనుము. 102

